# భరతసారమ్

(చంద్రశేఖర కృతమ్)



ఆంధ్ర వ్యాఖ్యాత

'నాట్యాచార్య'

లంకా సూర్యనారాయణశాస్త్రి

Telugu

# భరతసారమ్

## ( చంద్రశేఖరకృతమ్ )

BHARATA SĀRAM
(CHANDRA SEKHAR KRITAM)






TELUGU TRANSLATION,

ఆంధ్ర వ్యాఖ్యాత :

"నాట్యాచార్య" లంకా సూర్యనారాయణశాస్త్రి

NATYACHĀRYA LANKĀ SURYANĀRAYNA SASTRY.

# విజ్ఞప్తి

భరతసారమను ఈ గ్రంథమును ప్రసిద్ధ భరత విద్యావిశారదులు, నాకు భరతశాస్త్రోపదేశికులు కీ. శే. నగు సిద్ధాబత్తుని వీరరాఘవయ్యగారు 1942 సం॥న ఈ గ్రంథ ప్రయోజనమును చెప్పుచు మొదటి పూర్వరంగప్రకరణము, చివర ప్రకరణమందలి స్థానకలక్షణములు లుప్తములనియు, అవి శాస్త్రపరిశోధనచేసి పూరించిన పరిపూర్ణ భరతశాస్త్రగ్రంథము కాగలదనియు, భరత విద్యాభ్యాసకుల కెంతయో ఉపయుక్తమని చెప్పి నన్ను పూరించవలసినదిగా నాకొసగినారు. తదుపరి 1945 సం॥న నాట్యకళాపోషకులగు డాక్టర్ చంద్రమౌళి సత్యనారాయణ రావుగారు "శ్రీ భారతీయ నాట్యశాల" యను పేరుతో భరతనాట్య పాఠశాలను తెనాలిలో నిర్మించి అందు నన్ను ప్రధాననాట్యాచార్యునొనర్చి నాట్యశాలకు అనుబంధశాఖగా నాట్యగ్రంథములను పరిశోధించుటకును, శిథిలభాగములుగల ఈ భరతసారమును పూర్తి గావించుటకును యెంతయో తోడ్పడినారు.

ఆంధ్ర దేశమున భరతనాట్య మొనర్చు నటీనటవర్గీయులకు పరమ ప్రమాణమగు భరతసారసంగ్రహము చంద్రశేఖర పండితకృతమగు ఈ భరత సారమునకు ఆంధ్ర పద్యానువాదము. మూలగ్రంథము ప్రచారమందుండకపోవుట వల్లను, శిథిలప్రాయమగుట వల్లను, నృత్యలక్షణ పరిపూర్ణ గ్రంథము మరియొకటి ఆంధ్రమున లేకపోవుట వల్లను, భరతసార సముద్ధరణా విష్కరణల యవసరముకలిగినది.

భరతసారమను ఈ మహాగ్రంథము కోహల, నందికేశ్వర, హనుమాన్, నారద, అర్జున, శుక్ర, యాజ్ఞవల్క్య, బృహస్పతి, భరతముని, శార్ఙ్గదేవుల పదిభరతములను సమన్వయపరచి స్వతంత్రముగా పూర్వరంగ ప్రకరణము, హస్త ప్రకరణము, దేవతా హస్త ప్రకరణము, మనుష్యహస్త ప్రకరణము, మృగహస్త ప్రకరణము, సంకీర్ణ హస్త ప్రకరణము, పాదభేదప్రకరణము అని సప్తప్రకరణములుగా దీనిని వ్రాసినట్లు చిల్లకూరి దివాకరపండితుని భరతసార సంగ్రహమను

పద్యకావ్యమువలన తెలియుచున్నది. అంతియేకాని వీరి జన్మకాలముగాని, జననస్థలముగాని, ఎప్పుడు - ఎక్కడ అనునవి లభ్యముకాలేదు.

శిథిలీభూతమగు పూర్వరంగప్రకరణమును, చివరదియగు పాదభేద ప్రకరణమందలి స్థానకలక్షణములను పూరించుటకు నందికేశ్వర, కోహల, అర్జున, భరతముని, శార్ఙ్గదేవుల భరతములను ప్రమాణములుగా స్వీకరించినాను - మరియు ఈ భరతసారమునకు చిల్లకూరి దివాకర పండితుల భరతసార సంగ్రహమను పద్యకావ్యము యెంతయో యుపకరించినది. శిథిలపూర పరిష్కార విషయమున ఆత్మబుద్ధికంటెను గురుబుద్ధి విశేషమను లోకోక్తిననుసరించి అస్మద్గురుదేవులగు బ్రహ్మశ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారికి సాష్టాంగ నమస్కారములు.

ప్రత్తిపాడు వాస్తవ్యులు వైఖానసకుల తిలకులు, ఆగమశాస్త్రి పారంగతులు, ఏతద్గ్రంథమునకు కృతిభర్తయు, పండితులు, విశేషించి కవులు, నగు శ్రీమాన్ శ్రీనివాసుల వేంకటాచార్యులవారికిని, బ్రహ్మశ్రీ బిదుసు సీతారామశాస్త్రిల వారికిని, శ్రీ భారతీయ నాట్యశాల తరపున శ్రీయుతులు డాక్టర్ చంద్రశేఖర సత్యనారాయణరావుగారికిని కృతజ్ఞతా పూర్వకవందనములు.

మరియు ఈ గ్రంథమందలి రేఖాచిత్రములను వ్రాసియిచ్చిన ఆర్టిస్టు శ్రీ దాసరి వీరయ్యగారికి, ఛాయాచిత్రములను చిత్రించిన శ్రీ దేవరపల్లి రాధాకృష్ణమూర్తిగారికిని (మైస్టూడియోస్, గుంటూరు,) వెల్‌కం ప్రెస్ అధిపతులగు శ్రీ జంధ్యాల వెంకటప్పయ్యశాస్త్రిగారికిని నా స్వాగతములు.

తెనాలి,
25—1—'55.

ఇట్లు,
నాట్యాచార్య:
లంకా సూర్యనారాయణ శాస్త్రి.



భరతసార ఆంధ్రవ్యాఖ్యాత

లంకా సూర్యనారాయణశాస్త్రి

శ్రీః

# పరిచయము

నాట్యము మానవకోటి కతిసహజమైనది. ప్రపంచమందలి సర్వ దేశములందును సమస్తజాతులందును ఇది ప్రచారములో నున్నట్లు తెలియుచున్నది. మానవసృష్టిలో వాగభినయముల పూర్వోత్తరములు నిర్ణయించుట కష్టము. కాని సామాన్యదృష్టికి అభినయసృష్టియే ప్రథమమనిపించును. మానవుల పరస్పర భావవ్యక్తీకరణములో అభినయరహితమైన వాక్కు సామాన్యముగా ఉండదని చెప్పవచ్చును. ఒకొప్పుడు వాగన్వితముకాని అభినయము క్వాచిత్కముగా నుండిన నుండవచ్చును.

శబ్దానుశాసనము చేయుదలచిన వ్యాకర్త లోకములో సిద్ధములైన శబ్దస్వరూపములను, తల్లక్ష్యభూతములైన అర్థములను గ్రహించి మఱి శబ్దాపశబ్దనిర్ణయపూర్వకముగా సులభ గ్రహణార్థము ధర్మనియమము చేయును. అట్లే నాట్యశాస్త్రము రచింపదలచిన నాట్యవేత్త లోకములో బహుముఖముగా అనంతముగా ప్రచారములోనున్న అభినయ స్వరూపములను గ్రహించి యుక్తాయుక్తాభినయ నిర్ణయపురస్సరముగా ఉచితభావస్ఫోరకము మనోజ్ఞమునగురీతిని గ్రహణసౌకర్యముకోసము ధర్మనియమము చేసినట్లు సూచితమగుచున్నది. అందుచేతనే-

దేవానామసురానాంచ రాజ్ఞామథకుటుంబినాం।
బ్రహ్మర్షీణాంచ విజ్ఞేయం నాట్యం వృత్తాంతదర్శకం॥
యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖసమన్వితః।
సోఽంగాద్యభినయోపేతో నాట్యమిత్యభిధీయతే॥
త్రైలోక్యస్యాస్య సర్వస్య నాట్యం భావానుకీర్తనమ్॥

అని భరతముని నాట్యస్వరూపము నిర్వచించినాడు. అనగా నానాభావోప సంపన్నము, నానావస్థాంత రాత్మకమునగు త్రైలోక్యవృత్తాను కరణము నాట్యస్వరూపమని భావము.

ఈ నాట్యవిద్య మర్త్యలోకమందే కాక స్వర్గాది లోకములందు కూడా వర్తించుచున్నదనియు, దీనికి ఆదికర్త పద్మభువుడనియు, ఆయన

దీనిని పంచమవేదముగా సృజించెననియు, తన్నాట్యవేదమును బ్రహ్మ వలన తెలిసికొని తాను నాట్యశాస్త్రము రచించినట్లును భరతముని పేర్కొన్నాడు. ఈ విద్యను శివపార్వతులును బ్రహ్మవిష్ణునందికేశ్వరాదులును రచించినట్లు అన్యత్ర కనబడుచున్నది. దీనినిబట్టి ఈ నాట్యవిద్యకు గల ప్రామాణ్యము ప్రాశస్త్యము ప్రాచీనత స్పష్టమగుచున్నవి.

ఈ నాట్యము నానావిధార్తులకు విశ్రాంతి జననము, సుఖితులకు ధర్మ్యము, యశస్యము, ఆయుష్యము, హితము, బుద్ధివర్ధనము లోకోపదేశజననము అనుచు ప్రయోజనము లనేకములు పేర్కొని –

నతజ్జ్ఞానం నతచ్ఛిల్పం నసావిద్యా నసాకలా।
నాసౌయోగో నతత్కర్మ నాట్యేஉస్మిన్యన్నదృశ్యతే॥

అని భరతాచార్యుడు దీనిని సర్వప్రయోజన సమష్టి రూపముగా ప్రశంసించినాడు.

ఈ నాట్యము నాటకాదులందు ప్రయోజ్యమైనది. నాటకాదులు రసాశ్రయములు. రసము ఆనంద సబ్రహ్మచారి. ఆనందము సర్వప్రాణి సహజమైనది – సమస్త జనలక్ష్యభూతమైనది. తదనుభూతి రసాస్వాదనమువల్ల కలుగుచున్నది. రసములు భావములవల్ల నిష్పన్నములగుచున్నవి. భావములు – సాహిత్యమందు శబ్దార్థాదులవల్లను, సంగీతమందు నిషాదర్షభగాంధారాది స్వరములవల్లను, చిత్రకలయందు వర్ణరేఖాదులవల్లను వ్యక్తములగుచున్నవి. అట్లే ఆంగికాద్యభినయమువలన భావము లభివ్యక్తికి వచ్చుచున్నవి.

భావములు తమతమ సాక్షాత్కారమునకు సాధనభూతమైన అభినయమువలన రసములను భావించుచున్నవి. రసభావముల పరస్పర భావనమువలన అభినయసిద్ధి కలుగుచున్నది. ఈ విషయము ఈ భరతసారమందు కూడా –

కంఠేనాలంబయేద్గీతం హస్తేనార్థం ప్రదర్శయేత్।
చక్షుర్భ్యాం దర్శయేద్భావం పాదాభ్యాం తాళమాచరేత్॥
యతోహస్తస్తతో దృష్టిర్యతో దృష్టిస్తతోమనః।
యతో మనస్తతో భావో యతోభావస్తతోరసః॥

అని సూచితమైనది. అట్టి రసభావసహకృతమైన అభినయము సామాజికులకు అలౌకికాహ్లాదజనకమై పరమపురుషార్థమునకుసాధనమగుచున్నది.

ఈ నాట్యము వాద్యాభినయ సంగీతరసాది సహకృతమైనది. ఇది వాచికాంగికాహార్య సాత్వికభేదముచేత చతుర్విధము. ఇందలి వాచికమునందు శబ్దార్థ ప్రధానమగు సాహిత్యమును, భావప్రధానమగు సంగీతమును అంతర్భూతములగుచున్నవి. ఆంగికాహార్యములందు వర్ణరేఖాది ప్రధానమగు చిత్రకళ అంతర్గతమగుచున్నది. కనుక లలితకళలని పేర్కొనబడుచున్న సంగీత సాహిత్యచిత్రవిద్యలకు నాట్యశిల్పము సమష్టిరూపమని చెప్పవచ్చును.

అభినయము నాట్య – నృత్య – నృత్తభేదముచే త్రివిధమైనది. నాట్యము నాటకాదిరూపకములందే ప్రయోజ్యమనియు, నృత్తము రసభావవిహీనమనియు, రసభావవ్యంజకాదియుతము నృత్యమనియు నిర్వచించినారు. నాటకాదులందు రసభావములు ప్రధానములగుటచేత వానిననుసరించి వస్త్వనుకూలములగు వాచిక వాక్యార్థాభినయాదులు ప్రధానములగుచున్నవి. వానియందు నృత్తనృత్యము లుండవని తాత్పర్యము కాదు. ఆయా సన్నివేశాదులను తత్తదంగరసములను అనుసరించి అవి అప్రధానముగా ప్రయోజ్యములగుచుండుననియే భావము. అట్లే ఆంగికాభినయమును ప్రతిపదార్థాభినయమును నాట్యధర్మాదులును ప్రధానములగుటచేత నృత్యము రసభావవ్యంజకాది యుతమగుచున్నది. అందు సమప్రధానముగా గాని అప్రధానముగా గాని నృత్తమున కనుప్రవేశమున్నదని వేరుగాచెప్పనక్కరలేదు.

ఇక నృత్తము : లేక ఆంగికాభినయమును, నాట్యధర్మాదులును ప్రధానములగుటచేత దీనిని రసభావవిహీనమనియు, తాళలయాశ్రితమనియు నిర్వచించినారు. అయినను ఇందు రసభావము లత్యంతి ముండవని భావముకాదు.

చిరవిరించిర్న చిరం విరించిః సాకారతాసత్య సతారకాసా।
సాకారతాసత్యసతారకాసా చిరంవిరించిర్న చిరం విరించిః॥

ఇత్యాది కావ్యములందు రసభావము లెంతవరకు ప్రాధాన్యము వహించుచున్నవి? అట్లే మృదంగతాళాది శబ్దములు గర్జించుచుండ,

సరిగమల చిత్తజల్లులు వర్షించు పల్లవిపాటలందు భావ మెంతవరకు ప్రధానమగుచున్నది? కావున నృత్తమందు రసభావము లప్రధానముగా అను ప్రవేశ మొందునని యే తాత్పర్యము. ఏదో ఒక భావమును తదభి నిర్వృత్తమగు రసమును కించిత్తైన అభివ్యక్తముచేయని అభినయము లోకవిరుద్ధము. అందుచేతనే -

న భావహీనోఽ_స్తిరసో నభావో రసవర్జితః।
పరస్పరకృతాసిద్ధి _స్తయోరభినయో భవేత్ ॥

అని భరతాచార్యుడు ప్రవచించినాడు.

త్రివిధాత్మకమగు ఈ నాట్యము లాస్యతాండవ భేదముచేత ద్విధా భిన్నమైనది. లాస్యము సుకుమారనాట్యము - స్త్రీజనప్రయోజ్య మైనది. ఉద్ధతనాట్యము - తాండవము - పురుషజనప్రయోజ్యమైనది.

స్త్రీ పురుష జనోచితను జగత్కల్యాణానంద ప్రదము నగు ఈ నాట్యము పూర్వము భారతభూమిలో బహుళ ప్రచారములో నున్నట్లు కనబడుచున్నది. రాజాంతఃపురములందును, సంపన్నసౌధము లందును, సామాన్యావాసములందును చిత్రకళాది నైపుణ్యము నాట్య చాతుర్యము విరాజిల్లుచుండెడివను విషయము పురాణేతిహాసదృష్టికిని సాహిత్యరసికులకును సామాన్యమైనది.

ప్రభువులు శాస్త్రవేత్తలను, కళాకోవిదులను తమతమ ఆస్థాన ములందుంచుకొని సగౌరవముగ పోషించుచుండెడివారు. అందువలన సమస్త విద్యలందును సర్వతోముఖజ్ఞానము అభివృద్ధి నొందుచుండెడిది. తత్తద్విషయకములగు ఉత్తమ గ్రంథరచనలు సాగుచుండెడివి. ప్రజలు వివేక విజ్ఞాన వికసితబుద్ధులై సుఖించుచుండెడివారు. విద్యల నాదరింపక ఉపేక్షించుటచేతను, విద్యావిధులను ప్రోత్సహింపక విద్వేషించుట చేతను ఎట్టి అనర్థములు వాటిల్లునో తీక్ష్ణబుద్ధులకు తెలియనిదికాదు.

రాజులు శ్రీమంతులు రసికులు సమస్త శుభసమయములందును నాట్యాదులు ప్రదర్శింపజేసి ఆనందించుచుండుట చారిత్రకదృష్టికి క్రొత్తది కాదు. ఈ విషయము ఈ భరతసారముగూడ సూచించినది -

ద్రష్టవ్యే నాట్యనృత్తేచ సర్వకాలే విశేషతః।
నృత్యం తత్ర నరేంద్రాణా మభిషేకేమహోత్సవే।

యాత్రాయాం దేవయాత్రాయాం వివాహేప్రియసంగమే।
నగరాణా మగారాణాం ప్రవేశే పుత్రజన్మని।
శుభార్థిభిః ప్రయోక్తవ్యః మాంగల్యం సర్వకర్మసు॥

ఏతదర్థ మేర్పడిన కుశీలవకులములు దేవదాసీకులములు ఇందుకు ప్రబల నిదర్శనములు. మలబారులోని కథాకళినాట్యము, ఆంధ్రదేశములోని కూచిపూడిభాగవతము, వంగదేశమందలి మణిపూర్ నాట్యము, ఉత్తర దేశమందలి కథక్ నాట్యము మొదలైనవి భరతనాట్య సంతానములు. వాని స్వరూపభేదములు వివరించుట కిచట అవకాశములేదు.

ఆంధ్రదేశములో అనాదినుండియు భరతనాట్య మవిచ్ఛిన్నపరం పరగా వచ్చుచున్న సంగతి ఆంధ్రసాహిత్య పరిజ్ఞాతలకు, ఆంధ్రచరిత్ర పరిశోధకులకు సువిదితము. అందుకు శతాధికములగు యక్షగానములు క్షేత్రజ్ఞపదములు మొదలైనవి నిదానములు. తంజాపుర పరిపాలకులగు ఆంధ్ర మహారాష్ట్రప్రభువులు ఆంధ్రమున స్వయముగా గేయాదులు రచించియు, ఆంధ్రదేశమునుండి పదకర్తలను రావించి పదాదులు రచింపజేసి అభినయింపజేసియు వినోదించెడివారని వారి చరిత్ర చెప్పు చున్నది. కొండవీటి రెడ్డి ప్రభువులలో నొకరగు కుమారగిరి ప్రభువు వసంతరాజీయ మను నాట్యగ్రంథము రచించి లకుమాదేవి యను వేశ్యాంగనచేత ప్రయోగింపజేసినట్లును, ప్రతాపరుద్రుని బావమరది యగు జయసేనాని నృత్యరత్నావళి యను నాట్యగ్రంథము రచించి మాచలదేవియను వారకాంతచేత ప్రయోగింపజేసినట్లును, వీరివలన భరతనాట్యము బహుళప్రచారము నొందినట్లును ఆంధ్రదేశమున ప్రసిద్ధి కలదు.

ఇతివృత్తముతోగూడిన కూచిపూడి భామాకలాపముకంటె విల క్షణముగా నాట్యమును సమయవిశేషములం దభినయించుచుండెడి విశిష్టాచారము ఆంధ్రముననున్నట్లు శ్రీనాథుని పల్నాటి వీరచరిత్రయం దును, సోమనాథుని పండితారాధ్యచరిత్రము నందును—కనబడుచున్నది.

నాట్యమేళమువారు నవవిలాసముల
వచ్చి నమ్రతమ్రొక్కి ప్రక్కగానిల్వ

ఘనమై భవంబున కామభూవిభుడు
నవ్వుచు సెలవిచ్చె నాట్యంబుసేయ
పరమృదంగము లెస్సె వాయించుమేటి
కుడిభాగమునయందు కుదురుగానిలిచె
తాళ మానజ్ఞులు దాపటి దిశను
నిలచి రుత్సాహంబు నేరుపుమీర
ముఖ వీణవాయించు ముఖ్యుడొకండు
రాగ మాలాపించు రమణులిద్దరును
నిండు వేడుకతోడ నిలిచిరి వెనుక
కంజలోచనయను ఘనమైనపాత్రి
మదనుపట్టపుదంతి మంజులవాణి
భరత శాస్త్రోచిత బహురాగములను
గరిమతో నేర్చిన కంతుబాణంబు
వచ్చి సభాసదుల్ వర్ణించిచూడ
నిలిచి నాట్యమునకు నేర్పరియైన
వేత్రపాణికిదగ వినయంబుజూపి
అడడొసంగిన గజ్జ లతిభక్తితోడ
పాదములంగట్టి పంచవర్ణముల
కాశగట్టిగగట్టి కడుజవంబడర
మద్దెల తాళాల మధ్యనిలుచుండి
ఓరజూపునరాజు నొయ్యనజూచి
సమపాదయుతమైన స్థానకస్థితిని
తాత్పర్యమున దేవతలకును మ్రొక్కి
పుష్పాంజలియొసంగి పూనినాట్యంబు
సమకట్టి నాదంబు సభయెల్ల గ్రమ్మ
నైకోలు విడుదలల్ ఘనకళాశైలి
కై ముడికట్నముల్ కనుపింపజేసి
వెలయంగ తొమ్మిది విధములై నట్టి
భూచారి నాట్యంబు పొందుగాసలిపి
పదునారు విధములై పరగినయట్టి

ఆకాశచారియు నమరంగనాడి
అంగహారాఖ్యగలట్టి నాట్యంబు
విదితమౌ తొమ్మిదివిధములనాడి
గతిచారి భేదముల్ గనుపడునట్లు
భ్రమణ సంయుతదీప్తి పటిమమీరంగ
పాణిభేదములను పాటించిచూపి
స్థానకసంచయ సంయుక్తి అమర
ప్రేరిణి దేశిని ప్రేంఖణ శుద్ధ
దండికాకుండలి తగుబాహుచారి
సప్తతాండవములు సల్పెచిత్రముగ
సభవార లాశ్చర్య సంయుక్తులైరి.

—పల్నాటి వీరచరిత్ర

జాళి, యొయ్యారంబు సరసంబుదనర
వరుస జతుర్విధ వక్త్రవిభ్రమము
బొరి సప్తవిధ నిజభ్రూలతాటనము
షట్త్రింశతిక్రమ చక్షురంకితము
షడ్విధ నాసా లసత్కుంచితంబు
ఘనయుక్తి దశవిధ కర్ణావధాన
మును నవవిధగళ ముఖోల్లసనము
సురుచిరత్రి విధవక్షో విలాసంబు
ధర జెప్పనొప్పు పాదద్వయుపంచ
కంబు నూరుద్వయ కలితపంచకము
బంబి సుగతి సమభంగి త్రిభంగి
యరదగు వింశతి యంగహారములు
ధర నిరువదిరెండు దానకంబులును
చర్తిసు దృష్టు జౌషష్టిహస్తములు
బత్తీసుచారులు భ్రమరులునేడు
నొగిగరణంబు లష్టోత్తరశతము
మొగి నూరలంకారములు శిరోభేద

ములు పదుమూడును ముప్పదిరెండు
వౌలు పారు దండనంబులునొప్ప హంస
గతియును మాతంగగతియును వృషభ
గతియును మర్కటగతియును మేష
గతియును మయూరగతియును భోగి
గతియును నా బెక్కుగతులు నొల్పార
రంభయాదిగ నప్సరస్సమూహంబు
గుంభినీ సతులతో గూడియాడంగ.

—పండితారాధ్య చరిత్ర–పర్వత ప్రకరణము

నేటికిని ఆంధ్రదేశములో చక్కని భరతనాట్య మభినయింపగల నాయకురాంధ్రు చాలమంది కలరు. ఎట్టి విషయమైనను భావమును వివరించి ప్రదర్శింపుమన్నచో వారు నిర్దుష్టముగా మనోహరముగా అభినయింపగలరు. చిరస్మరణీయులు యశశ్శరీరులు శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఒకానొక నాయకురాలిచేత హస్తాదులు పట్టించి, ఛాయాపటములుతీసి, తానును ఆనంద కె. కుమారస్వామిగారును ఆంగ్లములోని కనుపదించిన అభినయ దర్పణమున ముద్రింపించినారు.

తార్కాణము లిట్లుండ ఆంధ్రదేశములో భరతనాట్య మాది నుండి లేదనియు, దేశాంతరమునుండి తెచ్చుకొన్నారనియు, భరతనాట్య మతి ప్రాచీనసరణిలో నున్నదనియు, నవీనపద్ధతుల ననుసరించి మార్పులు చేయవలెననియు పలుకుట కేవల మజ్ఞానవిజృంభితము–సాహసము మాత్రము!

ఆంధ్రదేశములో భరతనాట్యాభ్యాసమునకై అర్థ ప్రదర్శనాదులకు నందికేశ్వరకృతమగు అభినయదర్పణమును, భావనిర్ణయమునకు భరతరసప్రకరణమును, విశేషవినియోగములకు ఈ భరతసారమును, భరతసారసంగ్రహమును, కరణాంగహారములకు (భంగిమలకు) భారతీయ నాట్యశాస్త్రమును, జయ సేనానికృతమగు నృత్యరత్నావళిని అనుసరించుచున్నట్లు చెప్పవచ్చును. వీనిలో అభినయదర్పణము భరత రస ప్రకరణముతప్ప తక్కినవి ముద్రితములైనట్లు కనబడదు. గ్రంథకర్తృ కాలాదులుకూడా తెలియుట లేదు.

చంద్రశేఖర కృతమగు ఈ భరతసారమునకు చిల్లకూర దివాకర కృతమగు భరతసార సంగ్రహము ఆంధ్రపద్యానువాదము. ఈ సంగ్రహమందు భరత, కోహల, నందికేశ్వ రాంజనేయ నారదార్జున శుక్ర యాజ్ఞవల్క్య బృహస్పతి శార్ఙ్గదేవులు రచించిన దశభరత గ్రంథముల నుండి విషయములు సంగ్రహించి భరతసారకర్త స్వతంత్రముగా ఈ భరతసారమును రచించినట్లు చెప్పియున్నది. మరియు

నృత్యమాత్రోపయోగ్యాని కథ్యంతే లక్షణైః క్రమాత్
ప్రథమంతు శిరోభేదః దృష్టిభేదః తతపరం
గ్రీవాహస్తౌ పాదభేదా స్థానకాని ప్రదర్శ్యతే.

అను లక్షణానుసారముగ నృత్యము శిరోభేదములు, దృష్టిభేదములు, గ్రీవాభేదములు, హస్తభేదములు, స్థానకములు అను షడంగములతో పరిపూర్ణము - నందికేశ్వరకృతమగు అభినయదర్పణమున పాదభేద - స్థానకములు లేకపోవుటచే అసంపూర్ణము. దీనినిబట్టి ఈ భరతసారమునకు గల ప్రామాణ్యప్రాశస్త్యములు సువ్యక్తములగుచున్నవి. అభినయదర్పణముకన్న ఈ భరతసారములో పాదభేదములు, స్థానకములు, వాద్యకులు, పాత్రదేవతాత్వము, కౌశిక, కంచుకము, నాట్యమండపము, యవనిక, అసంయుతహస్తములలో రేఖాచంద్రాది హస్తవిశేషములు ఇత్యాదులు విశేషములు. ఇంకను నాట్యభేదములనుపేరుతో కరణాంగహారము లిరువదినాలుగు చెప్పినాడు. ఇవి భరతోక్తములగు తాండవలక్షణాంగములుగా భాసించుచున్నవి.

చిరంజీవి శ్రీ లంకాసూర్యనారాయణశాస్త్రి ఈ భరతసారము నుద్ధరించి పరిష్కరించి సుబోధకమగు వ్యాఖ్యానము రచించినాడు. ఇందలి పూర్వరంగప్రకరణమును స్థానకలక్షణములును ఇతడు భారతీయ నాట్యశాస్త్రము, సంగీతరత్నాకరము అర్జునభరతము ఆదిభరతము ఇత్యాదులనుండి సేకరించి ఇందు నిబంధించినాడు. ఇతడు నాట్యశాస్త్ర పండితుడేకాక సంప్రదాయ సిద్ధమగు నాట్యవిద్యయందు సిద్ధహస్తుడు - నాట్యాచార్యబిరుదాంచితుడు.

ఈ భరతసారమందలి సంయుతాసంయుత హస్తములు నృత్య హస్తములు స్థానకములు ఇత్యాదులకు మనోహరములగు బొమ్మలు శ్రీ శాస్త్రి స్వీయపర్యవేక్షణముక్రింద వ్రాయించి ముద్రింపించినవి. అందుచేతనే నాట్యసమయమున ప్రేక్షకలోకమున కాహస్తములెట్లు ప్రదర్శితములగునో అట్టి ఆకృతులతోనవి యొప్పుచున్నవి. ఇట్టి చిత్రములతో అచ్చుపడిన గ్రంథ మిదివరకు లేదని చెప్పవచ్చును. ఇట్టి ఉత్తమగ్రంథము నాంధ్ర సరస్వతీ పాదపీఠమున సమర్పించుటకై శ్రీ శాస్త్రి సలిపిన కృషికి ఆంధ్ర దేశములోని నటీనట కులములును నాట్యపండితులును సహృదయులును కృతజ్ఞులు కాదగినవారు.

శ్రీమాన్ శ్రీనివాసుల వెంకటాచార్యులుగారు ఇట్టి ఉత్తమ గ్రంథమునకు కృతిభర్తలగుట "హేమ్నః పరమామోదః" అని చెప్పవలెను. శ్రీమాన్ ఆచార్యులుగారు వైఖానసకులతిలకులు, పండితులు, హరివిభవాద్యనేక గ్రంథకర్తలు, గాయకులు, వితరణయశోభాసితులు, విశేషించి ఈ భరతసారముద్రాపయితలు.

ఈ వ్యాఖ్యాతకును, ఈ కృతిభర్తకును ఆంధ్రసరస్వతి సర్వశుభము లనుగ్రహించునుగాక! శ్రీమతి రుక్మిణీ అరండేల్ అడయారులో నిర్వహించుచున్న కళాక్షేత్రమువలె శ్రీ సూర్యనారాయణ శాస్త్రి నిర్వహించుచున్న శ్రీ భారతీయ నాట్యశాల ఆంధ్రదేశములో భరతనాట్యాభివృద్ధికి మార్గదర్శకమై వర్ధిల్లునుగాక ఇత్యాశాస్మహే!

ఇతి శ్రీః

శక్కర్‌నగర్ -<br>జెల్లపల్లికాంప్<br>ఆషాఢరథ సప్తమి<br>30—1—55

ఇట్లు<br>త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి

శ్రీ గురుశ్శరణం

# పండితాభిప్రాయము

నాట్యాచార్యులగు శ్రీ లంకాసూర్యనారాయణశాస్త్రిగారు నాకుఁ జిరకాలమిత్రులు. తెనాలివాస్తవ్యులు. వీరు తర్క—సాహిత్యశాస్త్రములయందుఁ జక్కని కృషి చేసియు, నంతటితో నూరుకొనక, చతుర్విధాభినయ సంపన్నమగు నాట్యశాస్త్రమునందుఁ బ్రత్యేక పరిశ్రమ సలిపి, యీనాఁడు తమజీవితమును నాట్యకళారాధనకంకితము గావించియున్నవారు.

ఎప్పుడునుగాని కళాకారు లల్పసంఖ్యలోనే యుందురు. వారు తమకళారచనలచే సామాజికులను కళావిదులనుగా, కళారసికులనుగా, దీర్చిదిద్దుచుందురుగనుకనే, సామాజికులు బహుసంఖ్యలో నుందురనుట నాశ్చర్యముకాదు. ఇట్టి ఫలసిద్ధి నిమిత్తమయియే కళాకారులతో నత్యావసరము కల్గును సమాజమునకు. ఎక్కడో పదుగురు విజ్ఞులున్నంత మాత్రమున, నాట్యరసికత దేశదృష్టితో వ్యాప్తి చెందినట్లుకాదు. కథాకళి, కూచిపూడి, మణిపూరు, మొ॥ నాట్యభేదములనుగూర్చి, స్వయముగనో, సినీమాలద్వారముననో, శ్రవణమాత్రముగనో తెలిసికొని నాట్యకోవిదులవలె నటించువారి నెందఱినో చూచుచున్నాము. 'సర్వం హస్తిపదేమగ్న'మ్మన్నట్లు పై నాట్యభేదముల నన్నిటిని ఒక్క 'భరతనాట్యము' క్రిందనే కట్టగాఁ జేర్చి సంతోషించువారును లేకపోలేదు. ఈ పరిస్థితియంతయు దేనివల్ల? నిజమైన నాట్యసంప్రదాయము – భరతనిర్మితమైనది – యథాతథముగా దేశీయులకు – వ్యాపకముగాఁ – బరిచయము కాకపోవుటవల్ల నని చెప్పవచ్చును.

కనుకనే ఆంధ్రుల కర్తవ్య మింతటితోఁ దీఱలేదు. భరతనాట్యకళారసజ్ఞతను దేశీయులలో బహుముఖముల వ్యాపింపఁజేయవలసిన పనియెంతయుకలదు. వేదికలమీఁదను, 'వెండితెర'ల మీఁదను ప్రదర్శింపఁబడు హస్తపాదాది విన్యాసములన్నియు భరతనాట్యమని భ్రమపడు వాతావరణము తొలఁగిపోవలయును. 'ఇది భరతనాట్యము – దీనియందలి రసభావసంపత్తి యిది!' అని వివేచించుకొని యానందింపఁగల శక్తి యాంధ్రులలో మఱలఁ బరిమళింపవలయును. ఇట్టి మహా

ద్దేశముతోనే భరతశాస్త్రజ్ఞులు ఫలసిద్ధివఱకుఁ బట్టుదలతోఁ బని చేయవలయును.

ఈ దృష్టితోనే శ్రీ లంకా సూర్యనారాయణశాస్త్రిగారు ఈ 'భరతసార' మను గ్రంథము నాంధ్ర వ్యాఖ్యా విశిష్టముగాఁ బ్రకటించు చున్నారు. ఈ గ్రంథము శాస్త్రిగారికి 'పూర్వరంగ ప్రకరణము' వినాగా నుపలబ్ధమైనను, దీనికనువాదప్రాయమై, చిల్లకూరి దివాకరునిచేఁ దెలుఁగున రచింపఁబడిన 'భరతసార సంగ్రహము'ను బట్టి, దానికి మాతృకయగు దీనియందుఁ దప్పక పూర్వరంగముగూడ నుండి యుండు నని యూహించి, తద్గ్రంథ కర్త యే యే గ్రంథములనుండి పూర్వరంగ విషయముల నేర్చి కూర్చి వ్రాసెనో, వాటినే వీరు తిరుగఁ బరిశోధించి, యతని పద్యములకు సరియైన శ్లోకములను సంగ్రహించి, 'పూర్వరంగ' మొకటి సిద్ధముచేసికొని యిందు బఱపఱిచి, దీనికిఁ దాము తెలుఁగు వ్యాఖ్యానము వ్రాయుచు, హస్తప్రకరణమునందలి వివిధ హస్త విన్యాస స్వరూపములును సులభముగా నవగతమగుటకుఁగాను వాటికిఁ దగిన చిత్రములను వ్రాయించి యిందుఁ జేర్చి, నాట్యకళారసికులకు సర్వవిధ ముల నుపయోగించునట్లు రచించియున్నారు. ఇందలి ప్రకరణము లన్నియు సమగ్రమై, లక్ష్య (వినియోగ) లక్షణ సంపన్నమై యొప్పు టచే నాట్యసాధకుల కెంతయు లాభకరము. ఇంతటి పరిశ్రమ నాట్య కళయందలిలోఁతు లనుభవపూర్వకముగాఁ దడవిచూడని వారి కసాధ్య మని వేఱుగాఁ జెప్పఁబనిలేదు.

ఈ విధముగా 'భరతసార'మను దీనికి 'ఆంధ్రవ్యాఖ్యాత' యగు శ్రీ శాస్త్రిగారు, ఆంధ్రుల కింకను సరియైన యందుబాటులోనికి రాక, కళానుభవవిషయమునఁ గొఱకుడువడని భరతుని 'నాట్యశాస్త్రము'న కే యింత విపులమగు ఆంధ్ర వ్యాఖ్యానమును సచిత్రముగా రచించి, యాంధ్ర నాట్యకళను సమగ్ర పఱుచుటకుఁ బ్రయత్నింపఁ గలరని యాశించుచున్నాను.

ఇట్లు భవదీయుఁడు,

బిదురు వేంకటశేషయ్య. బి. ఎ.,

హైదరాబాద్ (దక్కన్)

# విషయ సూచిక

శ్రీ భరతాయ గురువే నమః

# భరతసారమ్

## పూర్వరంగ ప్రకరణము



### ప్రార్థన

ఆంగికం భువనం యస్య వాచికం సర్వవాఙ్మయమ్
ఆహార్యం చంద్రతారాది తం వందే సాత్త్వికం శివమ్
వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే
యన్నత్వా కృతకృత్యాస్స్యుః తం నమామి గజాననమ్

ఎవనికి భువనము ఆంగికాభినయమో, సమస్తవాక్కులు వాచికాభినయమో, చంద్రుడు నక్షత్రాదులు ఆహార్యాభినయమో, అట్టి సత్వగుణ ప్రధానుడగు శివునకు నమస్కరించుచున్నాను. బ్రహ్మాది దేవతలు సర్వకర్మలయొక్క ఆరంభమందు ఎవనికి నమస్కరించి కృతకృత్యు లగుచున్నారో అట్టి విఘ్నరాజగు గజాననుని నమస్కరించుచున్నాను.

విఘ్నానాం శమనం కర్తుం భూత ప్రోచ్చాటనాయచ
రంగ భూశుద్ధి భూత్యేవ పాత్ర సంరక్షణాయచ
ఆచార్య శిక్షాసిద్ధ్యర్థం పూర్వరంగం కరోమ్యహమ్

విఘ్నములను పోగొట్టుటకొరకు, భూతాదుల ఉచ్చాటన కొరకు, రంగస్థలము శుద్ధ్యతిశయము కొరకు, నాట్యమొనరించు పాత్ర సంరక్షణ కొరకు, నాట్య విద్యాచార్యుల శిక్షాసిద్ధికొరకును పూర్వరంగమును చెప్పుచున్నాను.

### రంగాధి దేవతా ప్రార్థన

భరతకుల భాగ్యకలికే భావరసానంద భూషితాపాంగే
జగదేక మోహనకరే జయజయ రంగాధి దేవతే దేవి

భరత కులమునకు (నాట్య సంప్రదాయమునకు) భాగ్యకలికా ప్రాయురాలా, రసభావముల ఆనందాతిశయముచే నలంకృత దృష్టులు గలదానా, జగన్మోహినియగు ఓనాట్యరంగస్థలాధి దేవతా, జయము.

నాట్యోత్పత్తి

ఋగ్యజుస్సామ వేదేభ్యో వేదాచ్చాఽథర్వణాత్క్రమాత్
వాద్యం చాభినయం గీతం రసాన్ సంగృహ్య పద్మభూః
వ్యరీరచ చ్ఛాస్త్రమిదం ధర్మ కామార్థ సిద్ధిదమ్
దుఃఖార్తి శోక నిర్వేద ఖేద విచ్ఛేద సాధనమ్
అపిబ్రహ్మ పరానందాదిద మప్యధికం ధృవమ్
న కించిత్ దృశ్యతేలోకే దృశ్యం శ్రావ్యమతః పరమ్

ఆదిని బ్రహ్మదేవుడు ఋగ్వేదమునుండి వాద్యము, యజుర్వేదమునుండి అభినయము, సామవేదమునుండి గానము, అధర్వణ వేదమునుండి రసమును గ్రహించి నాట్యశాస్త్రమును రచించెను. వేద సారమగు ఈ నాట్యశాస్త్రము ధర్మార్థ కామమోక్షముల నొసగునదియే గాక దుఃఖ, ఆర్తి, శోక, నిర్వేద, ఖేదాదులను పోగొట్టి ఆనంద మొసగును. బ్రహ్మ పరానందాధికమయినదిగూడ నగును. లోకమునకు దృశ్య - శ్రవ్యములు నాట్యముకన్న వేరు లేవు అని చెప్పవచ్చును.

నాట్యకర్తలు

శంభు ర్గౌరీ తథాబ్రహ్మ మాధవో నందికేశ్వరః
దత్తిలో కోహళశ్చైవ యాజ్ఞవల్క్యశ్చ నారదః
హనూమాన్విఘ్న రాజశ్చ షణ్ముఖోఽథ బృహస్పతిః
అర్జునో రావణశ్చైవ కన్యాబాణసుతా తథా
ఏతే భరత కర్తారో భువనేషు ప్రకీర్తితాః

శివుడు, పార్వతి, బ్రహ్మ, విష్ణువు, నందికేశ్వరుడు, దత్తిలుడు, కోహలుడు, యాజ్ఞవల్క్య, నారదుడు, ఆంజనేయుడు, విఘ్నేశ్వరుడు, కుమారస్వామి, బృహస్పతి, అర్జునుడు, రావణుడు, ఉషాకన్య అను ఈ పదునారుమంది భరతశాస్త్రకర్తలుగా లోకమున ప్రసిద్ధిచెందినారు.

వీరుగాక భరతముని, సంగీతరత్నాకర కర్తయగు శార్ఙ్గదేవుడు, శుక్రుడు మొదలగు వారుకూడా లోకప్రసిద్ధ నాట్యశాస్త్రకర్తలు. ఈ భరత సారమను గ్రంథము పైనిచెప్పిన భరతములలో కోహల, నందికేశ్వర, హనుమాన్, నారద, అర్జున, శుక్ర, యాజ్ఞవల్క్య, బృహస్పతి, భరతముని, శార్ఙ్గదేవుల పదిభరతములను క్రోడీకరించి విరచించబడినది.

### నాట్యభేదములు

నాట్యం నృత్తం నృత్యమితి మునిభిః పరికీర్తితమ్
నాట్యం తన్నాటకేష్వేవ యోజ్యం పూర్వకథాయుతమ్
రసభావ విహీనంతు నృత్తమిత్యభిధీయతే
రసభావ వ్యంజకాదియుతం నృత్య మితీర్యతే
ఏతత్త్రియం ద్విధాభిన్నం లాస్యతాండవ సంజ్ఞికమ్

నాట్యము, నృత్తము, నృత్యము అని నాట్యము మూడువిధములుగా చెప్పబడినది. నాట్యము నాటకములయందు పూర్వకథతోకూడి కొని యుండును. నృత్తము రసభావములులేక కేవల తాళ లయాశ్రితమైన నాట్యరూపము. నృత్యము రసభావములతోకూడి రస భావానుగుణ్యమగు నాట్యము కలిగియుండును. ఈ మూడును లాస్యమని, తాండవమని, రెండు విధములు.

సుకుమారంతు తల్లాస్యం ఉద్ధతం తాండవం విదుః

మృదువుగా రసభావములను అభినయించునది లాస్యమనియు, ఆంగికాభినయముతో రసభావముల సమ్మిశ్రితముచేసి అభినయించునది తాండవమనియు చెప్పబడినది.

ద్రష్టవ్యే నాట్యనృత్యేచ సర్వకాలే విశేషతః
నృత్యం తత్ర నరేంద్రాణాం అభిషేకే మహోత్సవే
యాత్రాయాం దేవయాత్రాయాం వివాహే ప్రియసంగమే
నగరాణా మగారాణాం ప్రవేశే పుత్రజన్మని
శుభార్థిభిః ప్రయోక్తవ్యః మాంగల్యం సర్వకర్మసు

పైనచెప్పిన మూడువిధములగు వానిలో నాట్య నృత్యములు రెండుసర్వకాలములందును చూడదగియున్నవి. మరియు నృత్యము రాజ పట్టాభిషేకము, తిరునాళ్ల, పెండ్లి ఊరేగింపు, దేవునిఊరేగింపు, వివాహము, ఇష్టుల కలయిక, పురప్రవేశము, గృహప్రవేశము, పుత్రోత్సవము మొదలగు సమయములయందు శుభార్థులు మంగళకరముగా ప్రయోగించవలయును.

## చతుర్వింశతి నాట్యభేదములు

శృంగార నాట్యముగ్రంచ భృంగి నాట్యంచ చిత్రకమ్
చారీనాట్యంచ చాళీయం శుద్ధనాట్యంచ విశ్రుతమ్
హస్త చాళీయనాట్యంచ మార్గనాట్యంచ సమ్మతమ్
అంగహారాఖ్య నాట్యంచ పాదచారీచ పార్శ్వకమ్
ముఖచాళీయ నాట్యంచ లవణీనాట్య మీరితమ్
దేశీనాట్యం ఫేరణీచ లీలానాట్యం తతఃపరమ్
తాండాళికంచ సంధిశ్చ భ్రాంతనృత్యం ప్రకాశ్యతే
భూచారినాట్య మావృత్తం విద్యుద్భ్రమర నాట్యకమ్
పుష్పాంజలిస్తు నాట్యంచ చతుర్వింశతి నాట్యకమ్
ఇత్యాది భేదనాట్యాశ్చ భరతజ్ఞైరుదాహృతాః

శృంగార, ఉగ్ర, భృంగీ, చిత్ర, చారీ, చాళీయ, శుద్ధ, హస్త చాళీయ, మార్గ, అంగహార, పాదచారీ, పార్శ్వక, ముఖచాళీయ, లవణీ, ఫేరణీ, దేశీ, లీలా, తాండాళిక, సంధి, భ్రాంత, భూచారి, ఆవృత్త, విద్యుద్భ్రమర, పుష్పాంజలి అని ఇరువది నాలుగు విధములుగా నాట్యము చెప్పబడుచున్నది. (ఇవి అన్నియు భరతనిము జెప్పిన తాండవలక్షణాంగములుగా కనబడుచున్నవి.)

శుద్ధ దేశీవిధం నాట్యం ద్వివిధం మంగళప్రదమ్
భుక్తిముక్తిప్రదం నృణాం నృత్యోత్సవమిదం జగుః

పైనచెప్పిన ఇరువదినాలుగు రకముల నాట్యములలో శుద్ధ-దేశీ నాట్యములు రెండు మంగళప్రదములు. ప్రజలకు భుక్తిని ముక్తిని కూడ నొసగునవిగాన శుద్ధ-దేశీ నాట్యప్రదర్శనముల నృత్యోత్సవమనిరి.

## సభా లక్షణము

విద్వాంసః కవయో భట్టాః గాయకాః పరిహాసకాః
ఇతిహాస పురాణజ్ఞా స్సభా సప్తాంగలక్షణమ్

విద్వాంసులు, కవులు, భట్టులు (పెద్దలు,) గాయకులు, పరిహాసకులు, ఇతిహాసకులు (పూర్వకథలు తెలిసినవారు,) పౌరాణికులు సభకు సప్తాంగములని చెప్పబడుదురు.

## సభానాయకుడు

శ్రీమాన్ ధీమాన్ వివేకీ వితరణ నిపుణో గానవిద్యా ప్రవీణః
సర్వజ్ఞః కీర్తిశాలీ సరసగుణయుతో హావ భావేష్వభిజ్ఞః
మాత్సర్యాద్యైర్విహీనః ప్రకృతి హిత సదాచార శీలో దయాళుః
ధీరోదాత్తః కళావాన్ నృపనయ చతురోఽసౌసభానాయక స్స్యాత్

ధనవంతుడు, బుద్ధిశాలి, యుక్తాయుక్త పరిజ్ఞాత, దానధర్మపరుడు, గానవిద్యాపారంగతుడు, సమస్త విషయ పరిజ్ఞాని, కీర్తికాముడు, సరసగుణములుకలవాడు, హావ-భావములు తెలిసినవాడు, [ "గ్రీవా రేచక సంయుక్తః భ్రూ నేత్రాది విలాసకృత్ భావ సూచక ప్రకాశో యస్స హావ ఇతికథ్యతే" గ్రీవా రేచకముల భ్రూ నేత్రముల భేదములచే మనోగతభావము స్వల్పముగా ప్రకాశితమైనచో అదిహావమనియందురు. ] ["నిర్వికారస్యచిత్తస్యభావస్స్యాదతివిక్రియా" నిర్వికారమగుమనస్సునకు మిక్కిలిగా వికారముకలుగుట, ( నిస్సంకల్పమగు మనస్సునకు సంకల్ప పరంపరలు గలుగుట) భావమనిచెప్పబడును]. మాత్సర్యాది దుర్గుణములులేనివాడు, కాలానుగుణ్యముగా సంచరించువాడు, దయగలవాడు, ధీరోదాత్తుడు- "గంభీరసారసంపన్నః కృపావా నవికత్థనః పరకీయగుణగ్రాహీ ధీరోదాత్తస్సఉచ్యతే" సుఖదుఃఖములయందు సమానుడు, గంభీరుడు, దేహబలముగలవాడు, పరుల దుఃఖమున కోర్వలేనివాడు, ఆత్మస్తుతి, ( స్తోత్రప్రియత్వము లేనివాడు, ) ఇతరుల సుగుణములను గ్రహించగలవాడు, ధీరోదాత్తుడనిచెప్పబడును. లలిత కళలను తెలిసిన విద్వాంసుడు, రాజనీతియందు నేర్పరియైనవాడు సభాపతిగా నుండుటకు యోగ్యుడు.

## సభాసదులు

మహాకుల సముద్భూతాః సర్వశాస్త్ర విశారదాః
సంగీతజ్ఞా విశేషేణ రసికా విజితేంద్రియాః
అమత్సరా స్స్వామిభక్తా స్సభ్యా ఏవం విధా మతాః

ఉన్నతకులసంజాతులు, సర్వశాస్త్రపారంగతులు, సంగీతశాస్త్ర విశేషజ్ఞులు, విశేషించిరసికులు, జితేంద్రియులు, మాత్సర్యరహితులు, స్వామిభక్తులు ఏవంవిధగుణయుక్తులగువారు సభాసదులుగా ప్రేక్షకులు, సామాజికులు, సదస్యులుగా చెప్పబడుదురు.

## పాత్రలక్షణము

తన్వీ రూపవతీ శ్యామా పీనోన్నత పయోధరా
ప్రగల్భా సరసా కాంతా కుశలా గ్రహ మోక్షయోః
చారీ తాళలయాభిజ్ఞా మండలస్థాన పండితా
హస్తాంగస్థాన నిపుణా కరణేషు విలాసినీ
విశాలలోచనా గీత వాద్య తాళాను వర్తినీ
పదార్థభూషా సంపన్నా ప్రసన్నముఖ పంకజా
నాతిస్థూలా నాతికృశా నాత్యుచ్చా నాతివామనా
ఏవం విధగుణోపేతా నర్తకీ సముదాహృతా.

(పాత్రమనియెడు) నాట్యకర్తె రూపవతి, యౌవన మధ్యస్థురాలు, పీనోన్నతపయోధరములుగలది, ప్రగల్భ, రసికురాలు, మనోహరమైనది, (కోపము) పట్టు- విడుపులయందు నేర్పుగలది, చారీవిధానము-తాళము లయ వీనియందు నేర్పుగలది, మండలవిధానము, స్థానకములయందు పండితురాలు, హస్త-పాద విన్యాస స్థానముల నేర్పరి, తాండవభేదము లగు కరణ- అంగహారములయందు చాకచక్యముగలది, విశాలమగు నేత్రములుగలది, గీత - వాద్య - తాళముల ననుసరించి నటించగలది, అమూల్యాభరణములుగలది, సంపన్నురాలు, ప్రసన్నమగు ముఖ వర్చస్సుగలది, మిక్కిలిలావు, మిగుల సన్నము, మిగులపొడవు, మిగుల పొట్టిగాని స్త్రీ నర్తకిగానుండుటకు యోగ్యమైనది.

### పాత్ర దేవతాత్వము

పాత్రస్యాంగేషు తిష్ఠంతి దేవతా స్సముపాశ్రితాః
బ్రహ్మరంధ్రే స్థితో దేవ స్సదాశివ ఇతీరితః
లలాటే క్షేత్రపాలస్తు శాక్యః కట్యంతరేస్థితః
మణిబంధే మహాదేవః పరమేశః స్థితో మహాన్
కరస్థలేఽచలా లక్ష్మీః కరాగ్రే జయపార్వతీ
వక్షఃస్థలే హృషీకేశః స్తనయో ర్మేరుమందరౌ
నాభౌతు దేవతా లక్ష్మీః జఘనే పృథివీతథా
ఊర్వో ర్దేవస్సహస్రాక్షః జంఘయోః కమలాసనః
జాన్వోశ్చ దేవతా వాయుః దృష్ట్యోశ్చైవ రమాసుతః
ఉభయోః పాదయో రేతౌ చంద్రసూర్యౌ ప్రకీర్తితౌ

నాట్యకాలమున పాత్రఅవయవములయందు దేవతలు ఆశ్రయించి యుందురు. బ్రహ్మరంధ్రమున సదాశివుడు, లలాటమున క్షేత్రపాలుడు, కటిస్థలమున బుద్ధదేవుడు, మణికట్లయందు మహాదేవుడు, హస్తముల యందు స్థిరలక్ష్మి, హస్తాగ్రముల పార్వతి, వక్షమున శ్రీమహావిష్ణువు, స్తనద్వంద్వమున మేరుమందరములు, నాభియందు లక్ష్మీదేవి, జఘనమున భూదేవి, ఊరుద్వంద్వమున ఇంద్రుడు, జంఘులయందు బ్రహ్మ, జానువుల వాయువు, దృష్టులయందు మన్మథుడు, ఉభయపాదముల చంద్రసూర్యులు ఆశ్రయించిఉందురు.

### అపాత్ర లక్షణము

పుష్పాక్షీ కేశహీనాచ పీనోష్ఠీ లంబకస్తనీ
అతిస్థూలాఽప్యతి కృశాఽప్యత్యుచ్చాఽప్యతివామనా
కుబ్జాచ స్వరహీనాచ దశైతా నాట్యవర్జితాః

పువ్వులేసిన కన్నులు, బట్టతల, లావైన పెదవులు, జారిన వక్షోజములు, అతిస్థూలము, అతికృశము, అతిదీర్ఘము, అతివామనము, మరుగుజ్జు, స్వరహీన ఈ పదిలక్షణములుగల స్త్రీలు నాట్యమునకు అయోగ్యులు.

## నీచ నాట్యము

అకృత్వా పూజనం పాత్రమాచరే ద్యది నాట్యకమ్
తన్నాట్యం నీచమిత్యాహుః నాట్యశాస్త్ర విదోబుధాః
నీచపాత్రకృతం నాట్యం యదిపశ్యంతి మానవాః
అపుత్రాః పశవశ్చైవ జాయంతే మృగయోనిషు
యస్మాత్సర్వం సమాలోచ్య పూర్వై ర్యదుదాహృతమ్
దేవతా ప్రార్థనాదీని కృత్వానాట్యము పక్రమేత్.

దేవతాపూజ, ప్రార్థనములేకయే చేసిననాట్యము నీచనాట్యమని చెప్పుదురు. నీచపాత్రచేసిన నాట్యమును చూచినవారు అపుత్రకులై పశువులై మృగయోనులయందు జన్మింతురు. కావునశాస్త్రము దెలిసిన పెద్దలు నిర్ణయించినట్లు దేవతాప్రార్థనాదులనుజరిపి నాట్యము ప్రారంభింపవలయును.

## నటలక్షణము

రూపవాన్ మధురాభాషీ కృతీ వాగ్మీ పటుస్తథా
కులాంగనాసుతశ్చైవ శాస్త్రజ్ఞో మధుర స్వరః
గీతవాద్యాది నృత్యజ్ఞ స్సిద్ధకః ప్రతిభానవాన్
ఏతాదృశై గుణై ర్యుక్తో నటఇత్యుచ్యతే బుధైః

రూపము, ఇంపుగమాటలాడునేర్పు, పాండిత్యము, భరతశాస్త్రజ్ఞానము, మధురమైన స్వరము, గీత–వాద్య–నృత్యాదిజ్ఞానము, పట్టుదల, ప్రతిభ ఇట్టిగుణములుగలవాడు నటుడని చెప్పబడును. నటుడనగా నాటకములను ప్రయోగించువాడని అర్థము. కేవల నాట్యమును ప్రయోగించువాడు నటుడు లేక నర్తకుడు అనిచెప్పబడును. నాటక ప్రయోగము చేయువానికి నర్తకలక్షణము లేకపోయినను సరిపోవును. కాని కేవల నాట్యమునకు నర్తకుడు నటలక్షణ లక్షితుడై మాత్రము ఉండవలయును. నటలక్షణములో "శాస్త్రజ్ఞః" అన్నపదమునకు "చతుర్థాభినయాభిజ్ఞః నటోభావాదిభేదవిత్" ఆంగిక, వాచిక, ఆహార్య, సాత్వికమను చతుర్విధ అభినయములను పూర్ణముగా తెలిసి ప్రయోగించ

గలవాడును, దశవిధనాటక భేదములను తెలిసినవాడును అని వ్యాఖ్యా నించుకొనవలెను.

### న ర్త క ల క్ష ణ ము

నర్తకః సూరిభిఃప్రోక్తః మార్గస్యాత్యే కృతశ్రమః

నర్తకుడనగా పైనచెప్పబడిన నటలక్షణ పరిపూర్ణుడుమాత్రమే గాక తాండవభేదములగు కరణాంగహారరూపమగు మార్గనృత్యమునందు సంపూర్ణముగా శ్రమచేసి సాధించినవాడని అర్థము.

### ఆ చా ర్య ల క్ష ణ ము

వాద్యత్రయే లక్ష్యలక్ష్మ వేద్యాచార్యః ప్రకీర్తితః
వాగ్మీ సురూప వేషో౽సౌ సురసః స్తుతి కోవిదః
సభాసు పరిహాసజ్ఞః భవేద్వాదన వాద్యవిత్.

నృత్త - గీత - వాద్యములయొక్క లక్ష్యలక్షణములను తెలిసినవాడు, వాక్ పాటవముగలవాడు, సుందరమైన వేషముకలవాడు సరసుడు, ముఖస్తుతిచేయగలవాడు, సభలయందు చమత్కారముగా మాటలాడి సదస్యులను నవ్వించగలవాడు, వాద్యవాదనములను తెలిసినవాడు ఆచార్యుడని చెప్పబడును.

### పా త్ర బ హిః ప్రా ణ ము లు

మృదంగశ్చ సుతాళేచ వేణు గీతి స్తతశ్శ్రుతిః
ఏకవీణా కింకిణీచ గాయకశ్చ సువిశ్రుతః
ఇత్యేవ మన్వయజ్ఞైశ్చ పాత్రప్రాణా బహిస్స్మృతాః.

మృదంగము, మంచితాళములు, పిల్లనగ్రోవి (ఫ్లూట్) వంతపాట, శ్రుతి, వీణ, గజ్జెలు, ప్రసిద్ధుడగు గాయకుడు అనునవి. ఎనిమిది నాట్యమొనరించు పాత్రమునకు బహిః ప్రాణములని చెప్పబడినవి.

### అం తః ప్రా ణ ము లు

జవ స్థిరత్వే రేఖాచ భ్రమరీ దృష్టి రశ్రమః
మేధా శ్రద్ధా వచో గీతి స్త్వంతఃప్రాణా దశస్మృతాః.

జనము, స్థిరత్వము, రేఖా, చపలత్వము, దృష్టి, శ్రమ లేక పోవుట, బుద్ధి, శ్రద్ధ, వాక్కు, సంగీతము అను పదియు నాట్య మొనరించు పాత్రయొక్క అంతఃప్రాణములని చెప్పబడినది. స్థిరములైన కరణాదులు, సమములైన హస్తవిన్యాసాదులు రేఖ అనబడును.

## కాశీ లక్షణము

సంయుక్తా పంచభిర్వర్ణైః కాశికా కురుతే యది
పంచభూతాః పంచవర్ణాః దేవతాస్తత్ర కీర్తితాః

రక్తాది పంచవర్ణములు కలుగునట్లు కాశీకోక తయారుచేసి నాట్యసమయమున ధరించినచో నాట్య మొనరించు వానికి దేహ దార్ఢ్యము, దేహకాంతి నొసగును. పంచవర్ణములుగల పృథివ్యాది పంచభూతములు కాశీకోక అధిదేవతలు అని చెప్పబడుచున్నవి.

పంచభూతాధిదేవీంచ ధ్రువగ్రంథ్యధి దేవతామ్
పంచవర్ణ సమాయుక్తాం కాశికాం ప్రణమామ్యహమ్.

పంచవర్ణములు గలిగి పంచభూతములకు అధిదేవతయై ధ్రువ గ్రంథితో కూడిన కాశీకోకకు నమస్కరించి నడుమున ధరింపవలయును.

## ఊరుకంచుకము

అహో మార్గస్య నృత్యస్య మధ్యే దృష్ట్వోర్ధ్వ తాండవమ్
కాళీ లజ్జాన్వితా జాతా తస్యాం గీర్వాణ సంసది
స్త్రీభిః కథమిదం నాట్యం కర్తుం సంసది శక్యతే
ఇతి సంచింత్య భరతః కూర్పాసం పంచధాఽకరోత్
జఘనాంతం చోరుమధ్యం జాన్వంతం మధ్యజానుకమ్
ఆగుల్ఫాత్తు పురోవస్త్రం కింకిణీ జాలసంయుతమ్
పట్టసూత్రేణ సంబద్ధ్వా ధార్యం స్త్రీభిశ్చ సంసది.

శివ పార్వతులిద్దరు దేవతల సభయందు నాట్యమొనర్చు సమయమున శివుడు మార్గనృత్యమగు ఊర్ధ్వతాండవము (ఒక కాలు పైకి యెత్తి) చేయగా పార్వతిచూచి సిగ్గుపడినది. అపుడు భరతముని

స్త్రీలు సభలయందు మార్గనృత్యమగు తాండవాది భేదముల నాడు టకు ఎట్లు వీలుకలుగునని ఆలోచించి స్త్రీలుగూడ తాండవముల నాడు టకు వీలగునట్లు కూర్పాసమును (ఊరుకంచుకమును) ఐదువిధములుగా నిర్ణయించినాడు. ఒకటి జఘనాంతము (సెడ్డీ,) రెండు ఊరు మధ్యము (సగము తొడలవరకు చిన్నలాగు,) మూడు జాన్వంతము (మోకాలి చివరకుండు లాగు,) నాలుగు మధ్యజానుకము (మోకాలుదాటి పిక్కల వరకుండు లాగు,) ఐదు గుల్భ పర్యంతము (కాలిచీలమండ వరకుగల లాగు) ముందుకు కుచ్చెళ్లువచ్చునట్లుచేసి, పట్టుదారముతో గజ్జెలు కూర్చి కంచుకమును స్త్రీలు ధరించుటకు యోగ్యముగాజేసెను.

అర్ధోరుజఘ నాంతంచ పురుషాణాం ప్రశస్యతే.

మోకాలి పైకిగలది ఒకటి, పిరుదుల క్రిందికిగలది మరియొకటి ఈ రెండు లాగులు పురుషులు ధరించి నాట్యమొనర్చుట యోగ్య మగును.

ఆదౌ దేవగురుం పంచభూతాన్నత్వోరు కంచుకం
నానాచిత్రపటైః క్లుప్తం ధారయే న్నాట్యకర్మణి.

నాట్యమునకు మొదట అభీష్టదైవమును, నాట్యవిద్యా గురు వును, పంచభూతములను, నమస్కరించి అనేకములగు రంగు గుడ్డలతో తయారుచేయబడిన కంచుకమును ధరింపవలయును.

### గజ్జెలు

కింకిణ్యః కన కేనాఽథ తామ్రేణ రజతేనవా
లోహేనవా యథాశక్తి కారయే ద్ఘుటికాంతరాః
సుస్వరాశ్చ సురూపాశ్చ సూక్ష్మా నక్షత్ర దేవతాః
బంధయే న్నీలసూత్రేణ గ్రంథి భిశ్చ విశేషతః
శతంవా ద్విశతంవాపి పాదయోః నాట్యకర్మణి.

బంగారము, వెండి, రాగి, కంచు లోహములతో యథాశక్తిగా లోపల ఘుళికలుగలవిగను, మంచిధ్వని గలవిగను, చిన్నవిగను, అందమైనవిగను, నక్షత్రము అధిదేవతలుగాగలవిగను గజ్జెలు చేయించు

కోవలయును. నాట్య సమయమున నూరుగాని, రెండు నూర్లుగాని నీలిదారముతో కట్టి కాలియందు ధరించవలయును.

వాణీ లక్ష్మీశైలసుతా దేవతాం నీలసూత్రితాం
శతగ్రంథి సమాయుక్తాం కింకిణీం ప్రణమామ్యహమ్.

సరస్వతీ, లక్ష్మీ, పార్వతీ అధిదేవతలుగాగల్గి నీలిదారపు గ్రంథి శతముగల గజ్జెలకు నమస్కరించుచున్నాను.

కింకిణీ నాట్యమధ్యేతు విస్రస్తాయది భూతలే
తద్దోషపరిహారార్థం బ్రాహ్మీం లక్ష్మీముమాం స్మరేత్
నర్తకీ పాదకింకిణ్యశ్ఛిద్యతః పతితాయది
గురుదేవ నమస్కారం కృత్వా నాట్యం సమాచరేత్.

నాట్య మధ్యసమయమున కాలినుండి గజ్జెలుజారి భూమిమీద పడినయెడల లక్ష్మీ సరస్వతి పార్వతులను స్మరించినచో దోషముపోవును. కాలినుండి గజ్జెలు తెగి పడిపోయినచో గురుదేవతా నమస్కారముచేసి నాట్యమును చేయదగును.

### పాదభూషణ నిషేధము

సమస్త గుణసంయుక్తా సర్వతాళేషు కోవిదా
పాదభూషణ సంయుక్తా సభామధ్యేతు తాం త్యజేత్.

యోగ్యమగు నటీలక్షణములు గలిగి, సమస్తవిధ తాళజ్ఞానము గలిగిన నటి గజ్జెలు వినా మరియేవిధమగు పాదభూషణములు ధరించి రంగప్రవేశ మొనర్చినయడల అట్టి నటిని సభామధ్యమున విసర్జించవలయును.

### నాట్యమంటపము

సమస్త రాజ్య ఉదితా గౌరీ కృష్ణాచయా భవేత్
భూమిస్తత్రచ కర్తవ్యః కారిభిః నాట్యమంటపః
పరితః చతురశ్రాస్యు ర్భిత్తయో గృహనిర్మితాః
సుధా సంధ్యవలేపశ్చ విస్తారో చ్ఛ్రయ సంయుతః

రమ్యాం కుసుమ సంకీర్ణం స్వర్ణ రత్న విభూషితమ్
చిత్రోజ్జ్వల వితానాఢ్యం దీపికాశత శోభితమ్
పశ్చిమ ద్వార రహితం కర్పూరాగరు ధూపితమ్
ఏవంవిధ గుణైర్యుక్తం మంటపం స్యాత్తదస్మనే.

ఏ దేశమందు భూమి గౌర వర్ణము కృష్ణవర్ణము గలిగి యుండునో అట్టి భూమియందు సలుచదరములు గలిగి ఎత్తైన గోడలతో సంధిబంధములయందు చక్కగా సున్నము గొట్టబడి విశాలముగా ఎత్తయిన నాట్యగృహము పశ్చిమద్వార రహితముగా నిర్మింపవలెను. అందమైన పూవులు, సువర్ణ రత్నాభరణమును, చిత్రచిత్రముగా ప్రకాశించు తెరచీరలు, అనేకములగు దీపములు, కర్పూరాగరు ధూపదీపములతో నాట్యదర్శన సమయమందు రంగస్థలములు అలంకరించవలయును.

యవనిక

ధార్యా యవనికా రమ్యా నానావర్ణ విభూషితా
భావైర్బహువిధాకారైః రంజయంతీ జగత్త్రియమ్
అఖండమండలం చిత్రం విస్తీర్ణం దీర్ఘమంశుకం
విస్తృత్య పూర్వరంగేఽస్మిన్ నేపథ్యం కల్పయేద్బుధః
నేపథ్యాంతరితః పూర్వం రంగపూజాం సమాచరేత్.

బహువిధ వర్ణములచే అలంకరింపబడి బహువిధాకారములుగల భావములతో లోకత్రయమును రంజించు రమ్యమగు యవనికను నాట్య మండపమున నేర్పరచ వలయును.

ఇంకను అతుకులు లేక నలు చదరముగానుండి చిత్రవర్ణములు గలిగి రంగస్థలమునకు సరిపోవు నంతటి పెద్దదియగు నేపథ్య వస్త్రమునకు లోపలిభాగమున నేయుండి మొదట రంగపూజను, దేవతాప్రార్థనమును జేయవలయును.

వాద్యకులు (ఆర్కెస్ట్రా)

రంగమధ్యే స్థితే పాత్రే వామభాగే నటోత్తమః
దక్షిణే తాళధారీతు పార్శ్వయోస్తు మృదంగికౌ
తయోర్మధ్యే గీతకారీ నాట్యక్రమ ఇతీరితః.

నాట్యరంగమందు పాత్రమునకు ఎడమభాగమున నటుడును, కుడిభాగమున తాళధారి, వీరిద్దరికిమధ్య ఇద్దరు మృదంగికులు, వారి మధ్య గాయకుడు నాట్యసమయమున ఉండవలయును.

ప్రథమ వాద్యము

వాదయే త్ప్రథమం శుష్కం కాంస్యం గంభీరసంయుతం
గీతం నృత్తం వినా విఘ్నశాంత్యర్థ్యంచ సమాచరేత్.

నాట్యప్రారంభమునకు ముందుగ విఘ్నశాంతి కొరకు శుష్కమైన కంచుతాళములయొక్క గంభీరధ్వని కలుగునట్లు నృత్తగానము లేకుండగ వాయించవలయును.

రంగ పూజ

విఘ్నేశం భారతీం దేవీం బ్రహ్మ విష్ణు మహేశ్వరాన్
రంగే తద్దేవతాన్ వందే తాళవాద్యాదిభిః క్రమాత్

విఘ్నేశుని, సరస్వతిదేవిని, బ్రహ్మ, విష్ణు మహేశ్వరులను నాట్యరంగస్థలమున తాళవాద్యాదులచేత క్రమముగా నమస్కారము చేయుచున్నాను.

పుష్పాంజలి

హరీశ గోపతిభ్యశ్చ దిగీశేభ్య స్తథైవచ
పుష్పాంజలిం ప్రదాస్యామి తే రక్షంతు సభాసదః.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల కొరకు, ఇంద్రాద్యష్ట దిక్పాలుర కొరకు పుష్పాంజలి యొసగుచున్నాను. వారు సభాసదులను రక్షించు దురుగాక అనగా నాట్యసమయమున ప్రమాదజనితములగు దోషములను చూచుటవలన కలుగు పాపములనుండి సభాసదులగు ప్రేక్షకుల రక్షించుదురుగాక అని భావము.

నాట్యక్రమము

తస్మా త్సర్వం సమాలోచ్య పూర్వాచా ర్యదుదాహృతం
దేవతా ప్రార్థనాదీని కృత్వా నాట్య ముపక్రమేత్.

ఆకారణమువలన పూర్వనాట్యాచార్యులచేత నాట్యవిషయకములగు దేవతాప్రార్థనాదులు చక్కగా నాలోచించి చెప్పబడినవో, అట్టి ప్రార్థనాదులుచేసి నాట్యము ప్రారంభింపవలయును.

కంఠేనాలంబయే ద్గీతం హస్తేనార్థం ప్రదర్శయేత్
చక్షుర్భ్యాం దర్శయే ద్భావం పాదాభ్యాం తాళమాచరేత్.

గీతమును కంఠముచేతను, తదర్థమును పతాకాది హస్తముల చేతను, భావమును దృష్టిభేదములచేతను, తాళమును పాదములచేతను ప్రదర్శింపవలయును.

యతో హస్త స్తతో దృష్టి ర్యతో దృష్టి స్తతో మనః
యతో మన స్తతో భావః యతో భావ స్తతో రసః.

ఎచ్చట నటి గీతార్థసూచకమగు పతాకాది హస్తముద్రల నుంచునో అచట దృష్టి యుండవలెను. ఎక్కడ దృష్టియుంచునో అక్కడ మనస్సు ఉండవలెను. ఎక్కడ మనస్సు ఉండునో అక్కడ భావముండవలెను. ఎచట భావముండునో అచట రసముండవలెనని భావము.

## అభినయ లక్షణము

అత్రత్వభినయస్యైవ ప్రాధాన్యమితి కథ్యతే.

రసభావాది పరిజ్ఞానమందు అభినయమునకు ప్రాధాన్యమని చెప్పబడుచున్నది.

అభిపూర్వస్య ణీఞ్ ధాతో రాఖ్యానార్థస్య నిర్ణయః
యస్మా త్పదార్థా న్నయతి తస్మా దభినయ స్స్మృతః.

అభియనెడు నుపసర్గము పూర్వమందుగల ణీఞ్ ధాతువునకు చెప్పుట అనునర్థమునందునిర్ణయము. పదార్థములను సామాజికులకు అభిముఖ మగునట్లు పొందించునది కావున అభినయమని చెప్పబడుచున్నది.

## అభినయ భేదములు

ఆంగికో వాచిక స్తద్వ దాహార్య స్సాత్త్వికోఽపరః
చతుర్ధాఽభినయ స్తత్ర చాంగికోఽంగై ర్నిదర్శితః
వాచా విరచితః కావ్య నాటకాదిషు వాచకః
ఆహార్యో హార కేయూర వేషాదిభి రలంకృతిః
సాత్త్విక స్సాత్త్వికై ర్భావై ర్భావజ్ఞైశ్చ ర్నిదర్శితః.

అభినయము ఆంగిక - వాచిక - ఆహార్య - సాత్త్వికములని నాల్గు విధములు. అవయవములచేత ప్రదర్శింపబడునది ఆంగికము. కావ్య - నాటకాదులయందు వాక్కులచేత తెలియజేయునది వాచికము. హార కేయూరాద్యలంకారములచే అలంకరించుకొనుట ఆహార్యము. సాత్త్వి కాది భావములచేత తెలియజేయునది సాత్త్వికాభినయమని అభినయ జ్ఞులచేత నిర్ణయించబడినది.

### ఆంగికాభినయ త్రివిధత్వము

తత్రాంగికోఽంగ ప్రత్యంగోఽపాంగ భేదా త్త్రిధామతః.

పైనజెప్పిన ఆంగికాభినయము, అంగాభినయము - ప్రత్యంగాభి నయము - ఉపాంగాభినయము అని మూడువిధములు.

### అంగములు

అంగాన్యత్ర శిరో హస్తౌ కక్షౌ పార్శ్వౌ కటీ తటౌ
పాదావితి షడుక్తాని గ్రీవా మప్యరే జగుః

శిరస్సు, చేతులు, చంకలు, పార్శ్వములు, నడుము, పాదములు. ఈ ఆరు అంగములనబడును. కంఠముగూడ అంగమని కొందరి మతము.

### ప్రత్యంగములు

ప్రత్యంగాని త్వథ స్కంధౌ బాహూ పృష్ఠం తథోదరం
ఊరూ జంఘే షడిత్యాహు రపరే మణిబంధకౌ
జానూ కూర్పరమితి త్రయ మప్యధికం జగుః.

మూపులు, భుజములు, వీపు, పొట్ట, తొడలు, పిక్కలు ఈ ఆరు ప్రత్యంగములు. ఇవిగాక మనికట్లు, మోకాళ్లు, మోచేతులు గూడ ప్రత్యంగములని అధికముగా మూడింటిని కొందరుచెప్పిరి.

### ఉపాంగములు

దృష్టి భ్రూపుట తారాశ్చ కపోలౌ నాసికా హనుః
అధరో దశనా జిహ్వా చుబుకం వదనం శిరః
ఉపాంగాని ద్వాదశైతా న్యన్యాంగాని సంతిచ

పార్ష్ణి గుల్ఫౌ తథాంగుళ్యః కరయోః పదయో స్తలే
ఏతాని పూర్వశాస్త్రానుసారే ణోక్తాని వై మయా.

చూపులు, కనురెప్పలు, నల్లగ్రుడ్డు, చెక్కిళ్లు, ముక్కు, దవడలు, అధరము, దంతములు, నాలుక, గడ్డము, ముఖము, శిరము ఈ పండ్రెండు ఉపాంగములు. ఇవిగాక కాలిమడమలు, చీలమండలు, చేతివ్రేళ్లు, కాలివ్రేళ్లు, అరచేతులు, అరకాళ్లుగూడ ఉపాంగములని పూర్వ శాస్త్రానుసారముగా చెప్పబడినది.

అంగానాం చలనాదేవ ప్రత్యంగోఽపాంగయోరపి
చలనం ప్రభవే త్తస్మా త్సర్వేషాం నాత్ర లక్షణమ్.

అంగములయొక్క చలనమువలననే ప్రత్యంగోపాంగముల చలనము కలుగునుగాన ప్రత్యంగోపాంగములకు వేరుగాలక్షణము చెప్పలేదు.

నృత్యమాత్రోప యోగ్యాని కథ్యంతే లక్షణైః క్రమాత్
ప్రథమంతు శిరోభేదః దృష్టిభేదః తతఃపరమ్
గ్రీవా హస్తౌ పాదభేదా స్థానకాని ప్రదర్శ్యతే.

నాట్యమున కుపకరించు వానికి మాత్రమే ఇచట లక్షణవినియోగములు చెప్పబడును. వరుసగా శిరోభేద – దృష్టిభేద – గ్రీవాభేద – హస్తభేద – పాదభేద–స్థానకములకు యథాక్రమముగ లక్షణ వినియోగములు చెప్పబడుచున్నవి.

శి రో భే ద ము లు

ధుతం విధుత ముద్ధూత మవధూతంచ కంపితం
అకంపితో ద్వాహితేచ పరివాహిత మంచితమ్
నిహంచితం పరావృత్త ముత్క్షిప్తా ధోముఖేతథా
లోలితంచేతి విజ్ఞేయం చతుర్దశవిధం శిరః.

ధుతము, విధుతము, ఉద్ధూతము, అవధూతము, కంపితము, అకంపితము, ఉద్వాహితము, పరివాహితము, అంచితము, నిహంచితము, పరావృత్తము, ఉత్క్షిప్తము, అధోముఖము, లోలితమని పదు నాలుగు విధములు శిరోభేదములు గలవు.

ధు త శి రో ల క్ష ణ వి ని యో గ ము లు

పార్శ్వయో రుభయో రేక వారం సంచలితం యది
ధుతం వియోగే భేదేచ విస్మయే స్యాన్మదాలసే.

రెండు ప్రక్కల కొకసారి చలింపజేయబడిన శిరము ధుతశిర మనఁ బడును. ఈ ధుతశిరము వియోగము, భేదము, విస్మయము, మదము వలన కలిగిన అలసభావము వీనియందు వినియోగించును.

వి ధు త శి రో ల క్ష ణ వి ని యో గ ము లు

విధుత మసకృ త్త్వాదృక్కృతం శీతే భయే జ్వరే
అంగీకారే సురాపానాం ద్యే హాశేచైవ ప్రయుజ్యతే.

పైనచెప్పిన ధుతశిరము త్వరత్వరగా చలింపజేసిన విధుత శిర మగును. ఈ శిరము చలి, భయము, జ్వరము, అంగీకారము, కల్లు త్రాగగావచ్చు నిష, మూర్ఖత్వము వీనియందు వినియోగించును.

ఉ ద్ధూ త శి రో ల క్ష ణ వి ని యో గ ము లు

ఉద్ధూత మూర్ధ్వచలిత మాత్మ గర్వ బలాదిషు
ఏవం భరతశాస్త్రజ్ఞైః శిరోభినయ ముచ్యతే.

ఊర్ధ్వముగా చలింపజేయబడిన శిరముఉద్ధూతశిరమగును. తాను, గర్వము, బలము మొదలగువానియందు ఈ ఉద్ధూతశిర ముపయో గించబడుచున్నది.

అ వ ధూ త శి రో ల క్ష ణ వి ని యో గ ము లు

ఏకవార మధోనమ్ర మవధూత శిరో భవేత్
సంజ్ఞాం లజ్జాం వచ స్థైర్య వాసమే తేన దర్శయేత్.

ఒకసారి క్రిందకు వంచబడినశిరము అవధూత శిరమగును. సంజ్ఞ, సిగ్గు, వాక్‌స్థైర్యము, నివాసము వీనియందు అవధూత శిరము వినియోగించును.

కంపిత శిరోలక్షణ వినియోగములు

వికీక్ష్యోర్ధ్వ మధశ్శీఘ్రం చలితం కంపితం భవేత్
ఈర్ష్యాం ప్రణయకోపంచ పరుషోక్తంచ తర్జనే
ఆకర్ణనేచ నమనే దర్శయే న్నాట్యకోవిదః.

పైకిచూచి వెంటనే క్రిందకు చలింపజేసిన శిరము కంపితశిరమగును. ఈ కంపితశిరము, ఈర్ష్య, ప్రణయకోపము, కఠినముగా మాటలాడుట, భయపెట్టుట వినుట, వంచుట వీనియందుపయుక్తమగును.

అకంపిత శిరోలక్షణ వినియోగములు

ద్వివారం చాలయే దూర్ధ్వ మధశ్చేస్యా దకంపితమ్
నిందా సంజ్ఞా తర్జనాని హూతి మేతేన దర్శయేత్.

రెండుసార్లు పైకి క్రిందకు చలింపజేయబడిన శిరము అకంపితశిరమనబడును. ఈ శిరము నింద, సంజ్ఞ, భయపెట్టుట, పిలుచుట యందు వినియోగించును.

ఉద్వాహిత శిరోలక్షణ వినియోగములు

ఉద్వాహితం భవే దూర్ధ్వం మస్తకం సకృదున్నతమ్
ఔన్నత్యం శ్రేష్ఠవస్తూని దర్శయే న్నటశేఖరః

ఒకసారి పైకియెత్తబడిన శిరము ఉద్వాహితశిరమగును. ఎత్తుప్రదేశము, శ్రేష్ఠవస్తువులు ఉద్వాహితశిరముచే ప్రదర్శితములగును.

పరివాహిత శిరోలక్షణ వినియోగములు

పశ్చాత్ప్రసార్య చలితం యది స్యాత్పరివాహితమ్
వినయేచ విలాసేచ విస్మయేచ ప్రియే భవేత్

వెనుకకుసాచి చలింపజేయబడిన శిరము పరివాహితశిరమగును. వినయము, విలాసము, విస్మయము, ప్రియము వీనియందీ పరివాహిత శిరముపయోగించును.

అంచిత శిరోలక్షణ వినియోగములు

అంసే కుర్యా ద్ధరాంపశ్య న్యది స్యా దంచింతం శిరః
కార్యభారే మోహ చింతా భయ మూర్ఛాసు కథ్యతే

భుజమందు శిరమునుంచి భూమినిచూచిన అంచితశిరమగును. కార్యభారము, మోహము, చింత, భయము, మూర్ఛ వీనియందు అంచితశిరము వినియుక్తమగును.

నిహంచిత శిరోలక్షణ వినియోగములు

అంసా వున్నమ్య నమితం శిరశ్చాసి నిహంచితమ్
బిబ్బోకేచ ప్రకాశేచ కథా శ్రవణ కోపయోః

భుజముతోసహ ఎత్తివంచబడినశిరము నిహంచితశిరమనబడును బిబ్బోకము, (ఇష్టమగు వస్తువునందుగూడ ననాదరము) ప్రకాశము, కథలువినుట, కోపము వీనియందు నిహంచితశిరము వినియోగించును.

పరావృత్త శిరోలక్షణ వినియోగములు

పశ్చాత్ప్రుతం పరావృత్తం. కోప వైముఖ్యయో ర్హ్రియాం
పశ్చా త్ప్రదర్శనే చైవ భరతజ్ఞైః ప్రయుజ్యతే

వెనుకకు త్రిప్పబడినశిరము పరావృత్తశిరమగును. కోపము, పెడ మొగము, సిగ్గు, వెనుకకు చూచుట ఈ పరావృత్త శిరమునందు వినియోగించును.

ఉత్క్షిప్త శిరోలక్షణ వినియోగములు

ఉత్క్షిప్తం దృష్టగగనం రవి రిందు ప్రదర్శనే
ఔన్న త్యేచ ప్రదానేచ యుజ్యతే విబుధై రయమ్.

ఆకాశము చూచినశిరము ఉత్క్షిప్తశిరమగును. సూర్య చంద్రులనుచూపుట, ఔన్నత్యము, గొప్పదానముచేయుట వీనియందు ఉత్క్షిప్త శిరము వినియోగించును.

అధోముఖ శిరోలక్షణ వినియోగములు

చిరం వినమ్ర మధిక మధోముఖ ముదాహృతమ్
లజ్జా చింతా నమస్కారే ష్వేష తజ్జైః ప్రయుజ్యతే.

ఎక్కువకాలము బాగుగా వంచినశిరము అధోముఖశిరమగును. సిగ్గు, చింత, నమస్కారములయందు అధోముఖశిరము వినియోగించును.

లోలిత శిరో లక్షణ వినియోగములు

నిమీల్య లోచనే నమ్రం యది లోలిత ముచ్యతే
భూతావిష్టే చాలసత్వే నిద్రాయాం దైన్య మూర్ఛయోః
సురాపానమదేచాపి విద్యతే విబుధై రయమ్.

కన్నులు సగముమూసి ( అరకన్ను-మూగన్ను ) వంచినశిరము లోలితశిరమగును. ఈలోలితశిరము దయ్యముపట్టినవాడు, సోమరితనము, నిద్ర, దైన్యము, మూర్ఛ, కల్లుత్రాగిననిష వీనియందు ఈ లోలితశరీరము వినియోగపడును.

నవవిధ దృష్టి భేదములు

పార్శ్వదృష్టి ర్యాతదృష్టిః మీలితో న్మీలనే తథా
కంప వ్యావృత్తదృష్టీచ అంతర్మీలన మేవచ
అధస్తలం చోర్ధ్వతలం దృష్టియో నవధా మతాః.

పార్శ్వదృష్టి, యాతదృష్టి, మీలితదృష్టి, ఉన్మీలనదృష్టి, కంపదృష్టి, వ్యావృత్తదృష్టి, అంతర్మీలనదృష్టి, అధస్తలదృష్టి, ఊర్ధ్వతలదృష్టియని దృష్టిభేదములు తొమ్మిది విధములుగాచెప్పిరి.

పార్శ్వ దృష్టి లక్షణ వినియోగములు

దృష్టపార్శ్వా పార్శ్వదృష్టి రమర్షే పార్శ్వదర్శనే
సంజ్ఞాయాం ప్రణయక్రోధే భవేదేషా పరాఙ్ముఖే.

ప్రక్కకుచూడబడిన దృష్టి పార్శ్వ దృష్టి యగును. ఓర్వలేనితనము, ప్రక్కకుచూచుట, సంజ్ఞ, ప్రణయకోపము, పెడముఖము వీనియందీ పార్శ్వదృష్టి వినియోగించబడును.

యాత దృష్టి లక్షణ వినియోగములు

ఉభౌ పార్శ్వౌ యయా దృష్టా యాతదృష్టి ర్నిగద్యతే
అన్వేషణే భవేదేషా భయత స్సంప్రదర్శనే.

రెండుప్రక్కలకు చూడబడినదృష్టి యాతదృష్టియగును. వెదకుట, భయముతో చూచుట యందు యాతదృష్టి వినియోగించును.

మీ లి త దృ ష్టి ల క్ష ణ వి ని యో గ ము లు

మీలితే లోచనే స్యాతాం మీలితాదృష్టి రుచ్యతే
నిద్రా మదే శ్రమే ధ్యానే పారవశ్యేచ దృష్యతే.

కన్నులుమూసినదృష్టి మీలితదృష్టియగును. నిద్ర, మదము, శ్రమ, ధ్యానము, పరవశము, చెడుపనిచూచుట వీనియందీ మీలిత దృష్టి వినియోగించును.

ఉ న్మీ ల న దృ ష్టి ల క్ష ణ వి ని యో గ ము లు

ఉన్మీలనా యానిమిషా పురోభవతి మంజులమ్
ఆశ్చర్యేచ శ్రమే కోపభరే సుందరవీక్షణే
మనోరథే శరవ్యేచ దూరే నిశ్చలయో ర్భవేత్.

రెప్పపాటులేక ముందుకు మృదువుగాచూచిన ఉన్మీలనదృష్టి యగును. ఆశ్చర్యము, శ్రమ, అధికకోపము, అందముగాచూచుట, కోరిక, లక్ష్యము, దూరముగాచూచుట, నిశ్చలముగాచూచుట వీని యందు ఈ ఉన్మీలనదృష్టి వినియోగించును.

క ం ప దృ ష్టి ల క్ష ణ వి ని యో గ ము లు

ముహు ర్ని మేష్టి శ్చలితా కంపదృష్టి ర్భవే దియమ్
శృంగారే కంపనే శీతే నృత్యే మంజులభాషణే
కులాలచక్రత్వరితే తరంగే చాతపే నవే
ఉన్మేషేచ ప్రకాశేచ యుజ్యతేఽసౌ మనీషిభిః.

మాటిమాటికి కన్నులుమూయుచు చలింపజేసెడి దృష్టి కంప దృష్టి యనబడును. శృంగారము, వణుకుట, చలి, నృత్యము, అంద ముగా మాట్లాడుట, కుమ్మరసానియొక్క వేగము, తరంగము, ఎండ, నూతనము, కన్నులు తెరచుట, ప్రకాశము వీనియందీ కంపదృష్టి వినియోగించును.

### వ్యావృత్తదృష్టి లక్షణ వినియోగములు

వ్యావృత్తా వృత్త చలితే నేత్రే చావర్త భృంగయోః
నీరాజనే వర్తులేచ భవత్యేషా ప్రదక్షిణే.

కన్నులు గుండ్రముగాత్రిప్పి చలింపజేసెడిదృష్టి వ్యావృత్తదృష్టి యగును. సుడిగుండము, తుమ్మెదలు, నీరాజనము, గుండ్రనివస్తువు, ప్రదక్షిణము వీనియందీ వ్యావృత్తదృష్టి వినియోగించును.

### అంతర్మీలన దృష్టి లక్షణ వినియోగములు

అంతర్మీలన దృష్టిస్స్యా ల్లోచనే ఒర్ధనిమీలితే
దుఃఖే ధ్యానే ఒలసే కోపే పారవశ్యే భవే దియమ్.

కనులు సగము మూసిన దృష్టి అంతర్మీలన దృష్టియగును. దుఃఖము, ధ్యానము, మాంద్యము, కోపము, పారవశ్యము వీనియందీ అంతర్మీలనదృష్టి వినియోగించును.

### అధస్తల దృష్టి లక్షణ వినియోగములు

చిరం స్వచరణే దృష్టౌ యయా సాఒధస్తలా మతా
దైన్యే హ్రియాం నమ్రశీర్షే భవత్యేషా త్మదర్శనే.

చాలసేపు తనకాళ్లయందుచూచుట అధస్తల దృష్టియగును. దైన్యము, సిగ్గు, శిరమువంచుట, ఆత్మదర్శనము వీనియందీ అధస్తల దృష్టి వినియోగించును.

### ఊర్ధ్వతల దృష్టి లక్షణ వినియోగములు

దృష్టాకాశే భవే దూర్ధ్వతలదృష్టి స్సమున్న తే
మహా స్వ్యారంభేచ చంద్రార్క పవ నాత్మసు యుజ్యతే.

ఆకాశమును చూచినదృష్టి ఊర్ధ్వతలదృష్టియగును. మిక్కిలి యెత్తైన వస్తువు, మహాస్వారంభము, సూర్యచంద్రులు, వాయువు, ఆత్మ వీనియందీ ఊర్ధ్వతల దృష్టి వినియోగించును.

### గ్రీవా భేదములు

సుందరీచ తిరశ్చీనా తథైవ పరివర్తితా
ప్రకంపితాచ భావజ్ఞైః జ్ఞేయా గ్రీవా చతుర్విధా.

సుందరము - తిరశ్చీనము - పరివర్తితము - ప్రకంపితము-
అని గ్రీవము (మెడ) నాలుగువిధములు.

### సుందరీ గ్రీవాలక్షణ వినియోగములు

తిర్యక్ప్రచలితా గ్రీవా సుందరీతి నిగద్యతే
స్నేహారంభే తథాయత్నే సమ్యగర్థేఽపి చస్మృతౌ
సరసత్వేఽనుమోదేచ సాగ్రీవా సుందరీమతా.

అడ్డముగా గదలింపబడిన కంఠము సుందర గ్రీవ మనబడును.
స్నేహారంభము, ప్రయత్నము, మంచిదనుట, మరిచినదానిని గుర్తుకు
దెచ్చికొనుట, సరసము, అంగీకారమువీనియందు సుందరీగ్రీవముచెల్లును.

### తిరశ్చీన గ్రీవాలక్షణ వినియోగములు

పార్శ్వద్వయో ర్ధ్వభాగేతు చలనా త్సర్పయానవత్
సా గ్రీవాతు తిరశ్చీనా త్యుచ్యతే నాట్యకోవిదైః
ఖడ్గభ్రమే సర్పగత్యాం తిరశ్చీనా నిగద్యతే.

ఇరుప్రక్కలకు ఊర్ధ్వభాగములందు పామునడకవలె కదలించిన
తిరశ్చీన గ్రీవమగును. ఖడ్గభ్రమణము, పామునడక వీనియందీ తిరశ్చీన
గ్రీవము వినియోగపడును.

### పరివర్తిత గ్రీవాలక్షణ వినియోగములు

సవ్యాపసవ్య చలితా గ్రీవా యత్రాఽర్ధ చంద్రవత్
సాతు నాట్యకలాభిజ్ఞై ర్విజ్ఞేయా పరివర్తితా.
శృంగారనటనే కాంతా కపోల పరిచుంబనే
నాట్యతంత్ర కలాభిజ్ఞై ర్విజ్ఞేయా పరివర్తితా.

కుడి ఎడమలకు అర్థచంద్రాకారముగా కదిలించినచో పరివర్తిత మను గ్రీవమువచ్చును. శృంగారనటన, స్త్రీల చెక్కిళ్లు ముద్దిడుకొనుట వీనియందు ఈ పరివర్తితగ్రీవ ముపయోగించును.

ప్రకంపిత గ్రీవా లక్షణ వినియోగములు

పురఃపశ్చాత్ప్రచలనా త్కపోతీ కంఠ కంపవత్
ప్రకంపితేతి సా గ్రీవా ప్రోక్తా నాట్యవిశారదైః
యుష్మ ద స్మదితి ప్రోక్తే దేశీనాట్య విశేషకే
డోలాయాం గణితే చాపి ప్రయోక్తవ్యా ప్రకంపితా.

పావురాయి మెడకదిలించినట్లు ముందు వెనుకలకు కదిలించినచో ప్రకంపితమను గ్రీవమగును. నీవు, నేను అనుట, దేశీయ నాట్యవిశేషము, ఉయ్యాల, లెక్కపెట్టుట వీనియందీ ప్రకంపిత గ్రీవ ముపయోగించును.

హస్తలక్షణ వినియోగములు చెప్పుటకుముందు హస్తములకు ప్రాణములుండునుగాన వాని లక్షణము ముందుగా చెప్పబడును.

హస్త ప్రాణ లక్షణము

ప్రసారణం కుంచితశ్చ రేచితర పుంఖితం తథా
అపవేష్టితకంచాపి ప్రేరితో ద్వేష్టితే తథా
వ్యావృత్తః పరివృత్తశ్చ సంకేత స్తదనంతరం
చిహ్నం పదార్థటీకేతి ప్రాణా ద్వాదశ హస్తజాః.

ప్రసారణము – కుంచితము – రేచితము – పుంఖితము – అపవేష్టితము – ప్రేరితము – ఉద్వేష్టితము – వ్యావృత్తము – పరివృత్తము–సంకేతము – చిహ్నము – పదార్థటీక యని హస్తప్రాణములు పండ్రెండు విధములుగా చెప్పబడుచున్నవి.

ప్రసారణము

ప్రసారణమితి జ్ఞేయ మంగుళీనాం ప్రసారణాత్

వ్రేళ్ళుసాచుట ప్రసారణ మనబడు హస్తప్రాణమగును.

కుంచితము

కుంచనా దంగుళీనాంచ కుంచితం సముదీరితమ్

వ్రేళ్లు ముడుచుట కుంచితమను హస్తప్రాణమగును.

## గజదంతహస్తలక్షణ వినియోగములు



శిఖరౌ ప్రసృతకనిష్ఠౌ గజదంతో
భవతి సైష గజదంతే- సలిల-
నిమజ్జన శంకుస్థాపన
భూమిఖననేషు సంప్రయుజ్యః.

శిఖరహస్తములయొక్క చిటికెనవ్రేళ్లు సాచిపట్టిన గజదంత హస్తము అగును. ఏనుగ కొమ్ములు, నీటమునుగుట, శంకుస్థాపనము, భూమినిత్రవ్వుట, వీనియందు ఈ గజదంతహస్తము ఉపయోగమగును.

## తలముఖహస్తలక్షణ వినియోగములు

ముహుః పతాకౌ చలితౌ అన్యోన్యాభిముఖౌ యది
కరస్తలముఖప్రోక్తో నాట్యారంభాఽను మేళనే
ఇతస్తతోఽర్థేపి మందనటన స్త్రైణయో ర్భవేత్.



పతాకహస్తములు మాటిమాటికి చలింపజేయుచు ఒకదానికొకటి అభిముఖముగా పట్టిన తలముఖమను హస్తము అగును. నాట్యము ప్రారంభించుట, ఇటు - అటు అను అర్థము, నిదానముగా చేయబడు నాట్యము, స్త్రీలయొక్క స్వభావము వీనియందు ఈ తలముఖమను హస్తము వినియోగపడుచున్నది.

## విప్రకీర్ణ హస్తలక్షణ వినియోగములు



త్రిపతాకౌ కూర్పరస్థౌ విప్రకీర్ణకరో భవేత్
జాంగలేచకరన్యాసేసురావాహనమంత్రంయోః
తౌ విశ్లిష్టౌ ముహుస్స్యాతాం
కంపనే అంశుకాంచలే.

త్రిపతాకహస్తములు మోచేతులవిూద స్వస్తికగా కూర్చిపట్టిన విప్రకీర్ణహస్తము వచ్చును. అరణ్యాసంబంధ వృక్షాదికములు, కరన్యాసము (హస్తవిన్యాసము), దేవతాహ్వానము, మంత్రములయందు మరియు ఈ హస్తములను విడతీసి మాటిమాటికి చలింపజేసిన కంపము, వస్త్రముయొక్క- చివరభాగముయందును విప్రకీర్ణహస్తము ఉపయుక్తమగును.

## సూచీవిద్ధలక్షణ వినియోగములు

సూచీముఖౌ సంగతాగ్రౌ అన్యోన్యాభిముఖౌ యది
సూచీవిద్ధకరో భూయాద్ధృతే మేళన లగ్నయోః
హల్లీసాభినయే శాఖాఘట్టనేచ ప్రయుజ్యతే.



చివరభాగములు కలియునట్లు ఎదురెదురుగాసూచీముఖహస్తములు పట్టిన సూచీవిద్ధమను హస్తము అగును. ఆదరము, కూడిక, కలసికొనుట, కోలాటము వేయుట, చెట్లకొమ్మల యొరపిడి వీనియందు ఈసూచీవిద్ధహస్తము వినియోగించును.

## నలినీపద్మకోశహస్తలక్షణ వినియోగములు



పద్మకోశా వూరుదేశే
వ్యావృత్తే చలితావుది
నలినీపద్మకోశస్స్యా
న్మరోక్తి ముఖనాట్యయోః
సనాళకమలద్వంద్వే
భరతజ్ఞైః ప్రయుజ్యతే.

పద్మకోశహస్తములు ఊరువులదగ్గర వ్యావృత్తకరణమున చలింపజేయుచుపట్టిన నలినీపద్మ (సరోజ) కోశహస్తమువచ్చును. మర్మముగామాటలాడుట, ముఖనాట్యము, కాడతోకూడిన కమలములజంట, వీనియందు ఈనలినీపద్మకోశ (సరోజకోశ) హస్తము వినియోగమగును.

## మకరహస్తలక్షణ వినియోగములు



చలాంగుష్ట స్సర్పశీర్ష
స్తాదృశోపరి నిహితః
మకరస్స్యా త్స మకరే
జలప్లవన మత్స్యయోః.

బొటనవ్రేళ్లు చలింపజేయుచు సర్పశీర్ష హస్తములు ఒకదానిమీద ఒకటి ఉంచిన మకరమను హస్తమగును. మొసలి, ఈదుట, చేపలు వీనియందు ఈమకర హస్తము వినియోగమగును.

## జ్ఞానహస్త లక్షణ వినియోగములు



పతాకోప ర్యూర్ధ్వగామీ
హంసాస్య స్సంస్థితో యది
జ్ఞానహస్తో నిర్మమేచ
శమే ధ్యానే ప్రయుజ్యతే.

పతాక హస్తము మీద హంసాస్య హస్తముంచిన జ్ఞాన హస్తమగును. మమకారము లేకపోవుట, శమము, ధ్యానము వీనియందు ఈ జ్ఞాన హస్తము వినియోగపడును.

## పల్లవహస్త లక్షణ వినియోగములు



మిశ్రత్వకోష్ఠౌ చలితౌ
పతాకౌ చే దధోముఖౌ
శాఖాసు ఫల పుష్పాణాం
భారనమ్రాసు వందనే
నమ్రభావేచ వినయే
పల్లవోఽయం ప్రయుజ్యతే.

అధోముఖములుగా ముంజేతులు కలియునట్లు పతాకహస్తములు చలింపజేయుచుపట్టిన పల్లవ హస్తము వచ్చును. ఫలపుష్పముల బరువువలన వంగిన చెట్ల కొమ్మలు, వందనము, నమ్రభావము, వినయము వీనియందు ఈ పల్లవ హస్తము వినియోగమగును. [మరియొక పాఠ భేదము]

ప్రకోష్ట ముళితౌ శ్లిష్ట కనిష్ఠౌ పల్లవో భవేత్
పతాకౌ యది శత్రోశ్చ ప్రహారా చ్చాత్మ రక్షణే.

ముంజేతులు, చిటికెనవ్రేళ్లు కలియునట్లుగా పతాకహస్తములు పట్టిన పల్లవహస్తమగును. శత్రువు కొట్టుదెబ్బలనుండి రక్షించు కొనుట యందీ హస్తము వినియోగమగును.

అర్ధ రేచిత హస్త లక్షణ వినియోగములు

వామభాగ స్థితా వర్ధరేచిత శ్చాలపల్లవౌ
అర్థరేచిత నామాసౌ రథాంగయుగళే ర్గతౌ
అంగహారాఖ్యనాట్యేచ భరతజ్ఞైః ప్రయుజ్యతే.



ఎడమభాగమందు అలపల్లవ హస్తములు అర్థరేచిత ములుగా నొనర్చిన అర్థరేచితమను హస్తము వచ్చును. రథచక్రముల నడక, అంగహారమను నాట్యము, వీనియందు ఈ అర్థరేచిత హస్తము వినియోగపడును. [పాఠభేదము]

ఏకో వక్షోఽంతికే హంసపక్షోఽ న్యస్యోపరి పేష్టితః
అర్థరేచితహస్త స్స్యాత్ సత్య మిథ్యా నిరూపణే.

వక్షము దగ్గర ఒకదానిమీద ఒకటి హంసపక్ష హస్తములు పట్టిన అర్థరేచితమను హస్తమగును. ఈ హస్తము సత్యాసత్య నిరూపణమందు వినియోగించును.

## కేశబంధ హస్త లక్షణ వినియోగములు

త్రిపతాకా వానితంబ మాకేశాంతం ప్రచాలితౌ కేశబంధాభిధో జ్ఞేయో రత్నసానౌ ద్రుమద్వయే ప్రయుజ్యతే చోర్ధ్వమనే భరతాగమ వేదిభిః.



త్రిపతాక హస్తములు పిరుదులనుండి ఆకేశాంతమువరకు చలింపజేయుచు పట్టినచో కేశబంధమను హస్తమగును. రత్నసాను పర్వతము, వృక్షద్వయము, పైకి నడచుట వీనియందు కేశబంధ హస్తమువినియోగపడును.

## కపోతహస్త లక్షణ వినియోగములు



సర్పశీర్షోపరిన్యస్తే సర్పశీర్షే కపోతకః
కపోతయుగళే సర్పసంగమేచ
ప్రయుజ్యతే.

ఒకసర్పశీర్ష హస్తముమీద మరియొక సర్పశీర్షముంచిన కపోతమను హస్తమువచ్చును. పావురముల జంట, సర్పములయొక్క సంయోగముయందు ఈ కపోత హస్తము వినియోగపడును.

### పార్శ్వమండలహస్తలక్షణవినియోగములు

అరాళౌ నిహితౌ పార్శ్వే కరస్యాత్పార్శ్వమండలః
కపోతగమనేచాపి పన్నగాస్త్రే నియుజ్యతే.



అరాళహస్తములు పార్శ్వములందుపట్టిన పార్శ్వమండలము హస్తమగును. పావురములనడక, నాగాస్త్రము వీనియందు ఈపార్శ్వమండల హస్తము వినియోగించవలయును. (పాఠభేదము)

పతాకౌ పార్శ్వవిన్యస్తౌ పార్శ్వమండల సంజ్ఞికః
చక్రవాద్యే కింకిణీషు హస్తోఽయం సంప్రయుజ్యతే.

పతాకహస్తములు పార్శ్వములయందుపట్టిన పార్శ్వమండల హస్తమగును. చక్రవాద్యము, గజ్జెలు వీనియందు ఈపార్శ్వమండల హస్తము వినియోగించును:

### త్రిపతాకపక్షవంచితహస్తలక్షణవినియోగములు.

త్రిపతాకపక్షవంచితహస్తోఽయం కటితటే
యది స్యాత్తాం-త్రిపతాకౌ ఊరుయుగ్మే
భేదేఽతిశయే ప్రయుజ్యతే చాఽయమ్.

త్రిపతాకహస్తములు నడుముదగ్గరగా ఈషదూర్ధ్వముఖముగా పట్టిన త్రిపతాకపక్షవంచితహస్తమువచ్చును. తొడలు, భేదము, అతిశయము వీనియందు ఈత్రిపతాకపక్షవంచితహస్తము వినియోగపడును.

## కరిహస్త లక్షణ వినియోగములు

త్రిపతాకో వామహస్తః స్కంధదేశేతు దక్షిణః
అధో వక్త్రః పద్మకోశః కరిహస్తో నిగద్యతే
వినాయకేచ శుండాయాం యుజ్యతేఽయం కరో బుధైః.



ఎడమ భుజమందు ఎడమచేయి త్రిపతాకము, కుడిచేయి అధోముఖముగా పద్మకోశ హస్తము సాచిపట్టిన కరిహస్తమువచ్చును. వినాయకుడు, ఏనుగుతొండము వీనియందు ఈ కరిహస్తము వినియోగించబడును. [ పాఠాంతరము ]

ప్రసార్యైకం సర్పశీర్షం కర్ణేఽన్యత్ఖటకాముఖం
విన్యసేత్కరిహస్తోఽయం వేణీప్రహరణే ధను
రాకర్షణే దంతిశుండా చక్రభ్రమణయో ర్భవేత్.

ఎడమచేయిసాచి సర్పశీర్షహస్తము, కుడిచేయి చెవిదగ్గర ఖటకాముఖ హస్తముపట్టిన కరిహస్తమురాగలదు. జడతో కొట్టుట, ధనుస్సులాగుట, ఏనుగుతొండము, చక్రమునుత్రిప్పుట వీనియందు ఈ కరిహస్తము వినియోగించును.

## ఊర్ధ్వమండల హస్తలక్షణ వియోగములు

అరాళౌ ప్రసృతా వూర్ధ్వమూర్ధ్వమండల సంజ్ఞకః
ప్రశంసే కీరదంపత్యోర్గమనేచ ప్రయుజ్యతే.



అరాళహస్త ములు ఊర్ధ్వ ముఖముగా సాచిపట్టిన ఊర్ధ్వమండల హస్తము వచ్చును. ప్రళయము, శుక దంపతుల నడక వీనియందు ఈ ఊర్ధ్వమండల హస్త ముపయోగించును. [ పాఠాంతరము ]

పార్శ్వయోరుభయో రూర్ధ్వే పతాకౌ మండలాకృతీ
ఊర్ధ్వమండల హస్తస్యాత్ యోషాస్త్వేవ ప్రయుజ్యతే.

రెండు పార్శ్వములయందును ఊర్ధ్వముఖములుగా పతాకహస్త ములు మండలాకారమునపట్టిన ఊర్ధ్వమండల హస్తమగును. స్త్రీల యందీ హస్తము ఉపయోగించును.



ముష్టిస్వస్తిక హస్తలక్షణ
వినియోగములు

ముష్టిస్వస్తికనామా కూర్పర
మిళితౌ పురఃకే ముష్టికరా
మందాక్షక్షమయోరపి
నీవ్యాం దృఢవస్తుని ప్రయుజ్యేఽయమ్.

ముష్టిహస్తములు పొట్టమీద మణికట్ల క్రిందిభాగము కలియునట్లు స్వస్తికగా పట్టిన ముష్టిస్వస్తిక హస్తమగును. సిగ్గు, ఓప్పు, పోకముడి, దృఢమగు వస్తువు విని యందు ఈ హస్తము వినియోగమగును.

### ఉద్వృత్త లక్షణ వినియోగములు



విశ్లిష్టౌ హంసపక్షౌతు
వక్షస్సంముఖ మాశ్రితౌ
ఉద్వృత్తో హంసదంతో క్ర
రావర్తే చార్ధభావనే
చామరగ్రహణే తాపే
లజ్జాయాం శిశులాలనే
ప్రేంఖోలనే వసేత్యుక్తౌ
మందిరే సంప్రయుజ్యతే.

వక్షమున కెదురుగా హంసపక్ష హస్తములు ఒకదానికొకటి ఎదురుగ నుండునట్లుపట్టిన ఉద్వృత్తమను హస్తమువచ్చును. హంసమిథునము, సీటిసుడి, అర్థభావనము వింజామరలుపట్టుకొనుట, తాపము, సిగ్గు, పసిపిల్లలను లాలించుట, ప్రేంఖోలన మనునృత్యవిశేషము, ఉండుమనుట వీనియందు ఈఉద్వృత్తహస్తము వినియోగపడును.

### పురోమండలహస్తలక్షణ వినియోగములు

వ్యావృత్త పరివృత్తౌ తౌ వక్షోఽగ్రే చేదరాళకౌ
పురోమండలహస్త స్స్యాత్క్రౌంచ భంజనయోర్గతౌ.

వక్షమునకు ముందుభాగమున అరాళహస్తములు వ్యావృత్త పరివృత్తములుగాపట్టిన పురోమండలహస్తము అగును. క్రౌంచపక్షి, చెట్లగొట్టుట, పక్షులనడక వీనియందు ఈపురోమండలహస్తము వినియోగించును. [ పాఠాంతరము చిత్రపటసహితము ]

పురోమండలనామాసౌ పతాకా పురసోంతికే
భ్రాంతా వసూయా క్రుధయోః గర్జనే పామరే భవేత్.



వక్షస్థలమునకెదురుగా పతాకహస్తములు, పట్టిన పురోమండల మను హస్తము వచ్చును. భ్రాంతి, అసూయ, క్రోధము గర్జనము, పామర జనుడు వీనియందు ఈ పురోమండల హస్తము ఉపయుక్త మగును.

నితంబహస్త లక్షణ వినియోగములు

త్రిపతాకా వంసదేశా న్నితంబా వధిచాలితౌ
నితంబః ప్రతిసీరాయాం భ్రమరభ్రమణే తథా
పరివేషేచ హస్తస్స్యా దయం మకరతోరణే.



త్రిపతాకములు భుజములనుండి పిరుదుల వరకు చలింపజేయుచు పట్టిన నితంబమను హస్త మువచ్చును. తెరచీర, తుమ్మెద భ్రమణము, సూర్య చంద్రులయొక్క-- పరివేషము, మకరతోర ణము వీనియందుఈనితంబ హస్తముపయోగించును.
[ పాఠాంతరము ]

అపవేష్టిత మాశ్లిష్టా త్పతాకా చేన్నితంబయోః
నితంబో విపశాశ్చర్య శ్రమ దైన్యేషు యుజ్యతే.



శిరస్సునుండి పిరుదులవరకు పతాకహస్తములు (అపవేష్టితముగా) అధోముఖముగా చెలింపజేసిన నితంబమను హస్తము రాగలదు. వివశము (సంతోషపారవశముచే తెలివిదప్పుట), ఆశ్చర్యము, శ్రమము, దైన్యము వీనియందీ నితంబహస్తము వినియోగించును.

[వ్యాఖ్యా: అపవేష్టితం అధోముఖచలనం యథాతథా. ఆశీర్షాత్ శీర్షాదారభ్య అగత్యేతి శేషః. నితంబయోః స్థితౌ చేదితి శేషః. వివశః సంతోషాదిభిః పరవశః త్రైః స్మృతివిహీనః.]

ఈనితంబహస్తమందలి మొదటిబొమ్మ త్రిపతాకములు భుజములనుండి పిరుదులవరకును, రెండవబొమ్మ పతాకములు శిరమునుండి పిరుదులవరకును చలింపజేయుచు పట్టవలెననిభావము.

### ఉల్బణ హస్త లక్షణ వినియోగములు

ఉల్బణోనామ హస్తస్స్యాత్సమానా వలపల్లవౌ
ప్రసూనగుచ్ఛే పంకేజ లోచనేషు ప్రయుజ్యతే.

అలపల్లవ హస్తములు సమానమగునట్లు గావించి కించిత్పార్శ్వభాగమునకు పట్టిన ఉల్బణమను హస్తమగును. పూగుచ్ఛము, పద్మములు, నేత్రములు వీనియందు ఈ ఉల్బణహస్తము వినియోగపడును.

### ప్రయుక్తాలపల్లవహస్తలక్షణ వినియోగములు

ఉద్వేష్టితం ప్రయుక్తాలపల్లవ శ్చాలపల్లవౌ
ఉరసోఽగ్రే కామితాజ్ఞ స్తనేష్వేవ ప్రయుజ్యతే.

వక్షమునకుముందు ఊర్ధ్వముఖముగా అలపల్లవ హస్తములు పట్టిన ప్రయుక్తాల పల్లవమను హస్తమగును. కోరిక, పద్మము, స్తనములు వీనియందు ఈ ప్రయుక్తాల పల్లవహస్త ముపయోగించును.

లతా హస్త లక్షణ వినియోగములు

అగ్రేఽలపల్లవౌ హస్తౌ ప్రసార్యాథ ప్రచాలితౌ
లతాహస్తః పుష్పితాయాం లతాయాం కుట్మలేపిచ
నారీనాట్యే లతాహస్తో విబుధై స్సంప్రయుజ్యతే.



వక్షమునకు అగ్ర భాగముగా అలపల్లవ హస్తములు చలింపజేయుచు నాచి పట్టిన లతాహస్తము వచ్చును. పూలు, మొగ్గలు గల తీగె, నారీనాట్యము వీనియందీ లతాహస్తము వినియోగించును. (అలపల్లవహస్తము వక్షమందు చతురశ్రముగానుంచి కించిత్పార్శ్వ భాగముగాచూపిన ఉల్బణహస్తము, ఊర్ధ్వముఖముగాచూపిన ప్రయుక్తాల పల్లవహస్తము, ముందుభాగమునకు చలింపజేయుచు సాచిపట్టిన లతాహస్తము వచ్చునుగాన మూడు హస్తములకు చతురశ్రమునందు అలపల్లవములుగ ఒక బొమ్మనుమాత్రమే లతా హస్తమందు చూపబడినది.) [ లతా హస్తమునకు పాఠ భేదము. ]

దోలావ ద్భ్రామయిత్త్వైవ పతాకౌ సన్నివేశితౌ
పునఃపునః లతాహస్తః విచేష్టే నిశ్చలేతథా
సరసే నటనే చాఽయం భరతజ్ఞైః ప్రయుజ్యతే.

పతాకహస్తములు మాటిమాటికి ఉయ్యేలవలెనూపుచు, నిలుపుచు, రెండు పతాకలు కలిపిపట్టుచు నుండిన లతా హస్తము వచ్చును. చేష్టలుదక్కుట, నిశ్చలము, సరసము, నాట్యము వీనియందీ లతాహస్తము వినియోగించును.

సూచ్యాస్య హస్త లక్షణ వినియోగములు

సూచీముఖౌ పురోదేశాత్ పార్శ్వయోః స్సంప్రసారితే
సూచ్యాస్యోనామ విజ్ఞేయః వినియోగోఽస్య కథ్యతే
సుయోగేచ వియోగేచ పశ్యేతి వచనే శ్రమే
కపోలయోః శ్చితావేగ గజే కాలే ప్రయుజ్యతే.



వక్షము నుండి సూచీముఖ హస్తములు పార్శ్వభాగములకు, పార్శ్వముల నుండి వక్షమునకు ప్రసరింప జేసిన సూచ్యాస్యమను నృత్య హస్తమురాగలదు. (దీనిని సూచికాస్య మనికూడ అందురు.)

సంయోగము, వియోగము, చూడుమనుట, శ్రమ, చెక్కిళ్లు, చితి, ఏనుగు, కాలము యందు ఈ సూచ్యాస్యహస్తము వినియోగించును.

ఉరః పార్శ్వ మండల హస్త లక్షణ వినియోగములు

పతాకౌ చే దురఃపార్శ్వమండలో వక్షసోంతికే
పతౌ భ్రాంతః ప్రసృత్యాన్యో భరతజ్ఞై రుదీరితః
తురంగ వల్లనే తస్య శిక్షాయాంచ ప్రయుజ్యతే.



వక్షమునకుదగ్గరగా పతాకహస్తమొకటి చలింపజేయుచు, మరి యొకపతాకహస్తము పార్శ్వమునకు సాచిపట్టిన ఉరఃపార్శ్వమండలమను హస్తము అగును. గుర్రముయొక్క కళ్లెము, అశ్వశిక్షణ వీనియందు ఈ ఉరఃపార్శ్వమండలహస్తము ఉపయోగించును.

### దండపక్షహస్తలక్షణవినియోగములు

వ్యావృత్తౌ పరివృత్తౌ చ స్కంధయో రలపల్లవౌ
వదనాగ్రే దండపక్ష శ్చారీనాట్యే పరిభ్రమే
పుష్పాంజలౌ చ నాట్యాంతే ఖగసంచలనే భవేత్.



భుజములదగ్గర, ముఖముదగ్గర అలపల్లవహస్తములు వ్యావృత్త-పరివృత్తములుగాచేసిన దండపక్షమనుహస్తము వచ్చును. నాట్యమందలి చారీవిధానము, మండలవిధానము (గుండ్రముగా

తిరుగుట), పుష్పాంజలి, నాట్యాంతము, పక్షులసంచలనము వీనియందు ఈ దండపక్షహస్తము వినియోగించును. [ పాఠ భేదము ]



హంసపక్ష లతాహస్తౌ
పర్యాయేణచ పార్శ్వయోః
వ్యావృత్తౌ చే ద్దండపక్షో
భవే ద్బిబ్బోక యానయోః॥



హంసపక్షలతా హస్తములు ఒకదాని తరువాత నొకటి వ్యావృత్త కరణమున పార్శ్వములయందుపట్టిన దండపక్షమను హస్తమగును. స్త్రీవిలాసలు, నడకలు వీనియందు ఈ దండపక్షహస్త ముపయోగించ వలయును.

## పక్షద్యోతితహస్తలక్షణ వినియోగములు



పక్షద్యోతిత నామాఽయం
వక్షోఽగ్రే పక్షవంచితః
అగాధాయాంచ వాహిన్యాం
యుజ్యతే చాదిపోత్రిణి.



సంయుత హస్తమగు పక్షవంచిత హస్తమును ముందుగాపట్టి అనగా అర్థ చంద్ర హస్తములు రెక్కలవలె నడుమువద్ద పట్టి, తరువాత వక్షమునకు ముందుభాగమున ఆ అర్థ చంద్రహస్తములనే స్వస్తికగాచేర్చి పట్టిన పక్షద్యోతితమను హస్తము వచ్చును, లోతుగల నది, ఆదివరాహము వీనియందు ఈ పక్షద్యోతిత హస్తము వినియోగపడును.

### ముకుళ స్వస్తిక హస్తలక్షణ వినియోగములు



మిళిత్వా కోష్ఠౌ ముకుళౌ
ముకుళ స్వస్తికో మతః
దశసంఖ్యా జలజయో
ర్ముకుళేషు ప్రయుజ్యతే.

ఈ బొమ్మయందు చూపబడిన ముకుళహస్తములను ముంజేతులు కలియునట్లు స్వస్తికగా పట్టిన ముకుళ స్వస్తిక మను హస్తమువచ్చును. పది యను సంఖ్య, తామరపూలు, అరవిరి మొగ్గలు వీనియందు ఈ ముకుళస్వస్తికహస్తము వినియోగమగును.

### రేచిత హస్తలక్షణ వినియోగములు

పార్శ్వే ప్రసారితౌ భ్రాంతౌ రేచిత శ్చాలపల్లవౌ
చాళియసటనే చాఽయం నారికేళ ప్రతాపయోః
నాట్యాంతే యుజ్యతే హస్తః రేచితో భరతాగమే.

వక్షమునకు ముందు చతురశ్రములుగా నున్న అలపల్లవ హస్తములు పార్శ్వభాగమునకు ప్రసారింపుచు చలింపజేసిన రేచితమను హస్తమగును. చాళీయము (నాట్యవిశేషము), కొబ్బరికాయ, ప్రతాపము, నాట్యపరిసమాప్తము వీనియందు ఈ రేచితహస్తము వినియోగించును.

[ పాఠాంతరము ]

ఉద్వేతావాయతౌ హంసపక్షౌ పగ్రే ప్రసారితౌ
రేచితో చిత్రఫలకే పఠనే పాఠనే భవేత్.

హంసపక్షహస్తములు ముందుభాగమునకు సాచి ఊర్ధ్వముగా ఎత్తుచు పట్టిన రేచితమను హస్తమగును. చిత్రఫలకము, చదువుట, చదివించుట, వీనియందీ రేచితహస్తము ఉపయోగించును.

### ఆవిద్ధ వక్త్రహస్తలక్షణ వినియోగములు

ఆవిద్ధవక్త్రౌ ముకులౌ మణిబంధాంత చాలితౌ
తేవనే దేవపూజాయాం నటనే పక్షిసంగరే.

ముకుళహస్తములు మణికట్లుకలిపి చలింపజేయుచు పట్టిన ఆవిద్ధవక్త్రమను హస్తమురాగలదు. క్రీడావిశేషము, (ఆటప్రదేశము,) దేవతాపూజ, నటనము, పక్షులయొక్క పోట్లాట వీనియందు ఈ ఆవిద్ధవక్త్రహస్తము వినియోగించును. (ఈహస్తము ముకుళ స్వస్తికమునకు సన్నిహితముగానున్నది. దీనికి మరియొక పాఠాంతరము.)

భ్రామయిత్వా పతాకౌతు సుదీర్ఘం చే దధఃకృతౌ
ఆవిద్ధవక్త్రౌ దేశీయనటనా గ్ర్యాంఘి ఘాతయోః
స్రోతోఽవతరణే శీఘ్రే భరతాగమ వేదిభిః.

పతాకహస్తములు బాగుగాసాచి చలింపజేయుచు అధోముఖము లగునట్లు పట్టిన ఆవిద్ధవక్త్రమను హస్తమువచ్చును. దేశీయనాట్యము, మోఁగాలితో భూమినితట్టుట, ఏరుదాటుట, తొందర వీనియందు ఈ ఆవిద్ధవక్త్రహస్తము వినియోగమగును.

### అరాళఖటకాముఖహస్తలక్షణ వినియోగములు



తా వృథా స్వస్తికాకారౌ
అరాళ ఖటకాముఖః
పీటీనా నేచ స్ఫురణే
భేద శ్లాఘనయో ర్భవేత్.

ఒకచేయి అరాళముగను మరియొకచేయి ఖటకాముఖముగనుపట్టి స్వస్తికముగచేసిన అరాళఖటకాముఖమను హస్తము అగును. ఆకుమడుపులిచ్చుట, స్ఫురణ, భేదము, శ్లాఘనము వీనియందు అరాళఖటకాముఖము వినియోగించును. [పై లక్షణములో

"తావితి" అని యున్నది. అనగా "తావితి న పూర్వాపరా మర్శోఽయం. యః అరాళఖటకాముఖః తావితి గ్రంథకార సంకేతోఽయం. ఏతేన తావుభౌ అరాళ ఖటకాముఖౌ స్వస్తికౌ కారయతి అరాళఖటకాముఖో భవతీత్యర్థః" అని అర్థము.]

ముద్రాహస్త లక్షణ వినియోగములు



కరయో ర్మధ్యమాంగుష్ఠ
యోగా న్ముద్రాకరో భవేత్
అణౌ తృణౌ గోముఖేచ
త్రోటీపుట నిదర్శనే
ముద్రాహస్తో యుజ్యతేఽసౌ
భరతాగమ కోవిదైః.

రెండు హస్తముల యొక్క నడిమిడ్రేళ్లు, బొటనడ్రేళ్లు కలిపి పట్టిన ముద్రాహస్తము రాగలదు. అణువు, గడ్డిపోచ, ఆవుమోర, (ముఖము) పక్షుల ముక్కు చూపుట వీనియందు ఈ ముద్రాహస్తము వినియోగించబడగలదు.

గరుడపక్ష హస్త లక్షణ వినియోగములు

అర్ధచంద్రౌ పురః పశ్చా త్పార్శ్వయో స్సంవేశితౌ యది
భవే ద్గరుడ పక్షాఖ్యః విలాసగమనే తథా
గరుత్మతిచ హస్తోఽయం భరతాగమ వేదిభిః.

అర్ధచంద్రహస్తములు ముందునకు, ప్రక్కలకు, పిరుదులదగ్గర మార్పుచేయుచు పట్టిన గరుడపక్షమను హస్తముఅగును. ఒయ్యారముగా నడచుట, గరుత్మంతుడు వీనియందు ఈ గరుడపక్షహస్తము ఉపయోగపడుచున్నది.

## వరదాభయ హస్త లక్షణ వినియోగములు



ఏకో౽ధ ఊర్ధ్వమేకశ్చ
పతాకౌ వరదాభయః
సాక్షాత్కారే దేవతానాం
విష్ణౌ చాఽయం ప్రయుజ్యతే.

పతాకహస్తములు వక్షభాగమునకు కొంచెము ముందుగా ఒకటి ఊర్ధ్వముఖముగను ఒకటి అధోముఖముగను పట్టిన వరదాభయ హస్తమువచ్చును. దేవతా సాక్షాత్కారము, శ్రీ మహా విష్ణువు వీనియందు ఈ వరదా భయ హస్తము వినియోగపడును.

ఇతి శ్రీ భరతసార నాట్యాచార్య లంకా సూర్యనారాయణశాస్త్రి
విరచితే ఆంధ్రవ్యాఖ్యానే సంయుత హస్తప్రకరణమ్



# దేవతా హస్తప్రకరణమ్

## దశావతారములు

మత్స్య కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ బౌద్ధః కల్కి మేవచ.

మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, శ్రీరామ, బలరామ, బుద్ధ, కల్కియని శ్రీ మహావిష్ణువు యొక్క అవతారములు పది విధములు.

### మత్స్యావతారము

విధాయ మకరం హస్తం వైష్ణవస్థాన సంస్థితః
నిదర్శయేత్ స్మత్స్యరూపం గోవిందం నాట్యకోవిదః.

వైష్ణవస్థానమందు నిలిచి మకర హస్తములను ఒకదానిమీద ఒకటి పట్టిన మత్స్యావతారమగును.

### కూర్మావతారము

స్థానేతు వైష్ణవే సవ్యే పతాకే ఉర్ధస్థలే పరం
శుకతుండం విధాయా ఉదికూర్మం సందర్శయే ద్బుధః.

వైష్ణవస్థానకము నందుండి కుడి చేయి అధోముఖముగా పతాకహస్తము, ఎడమచేయి ఊర్ధ్వముగా శుకతుండము పట్టిన కూర్మావతార మగును.

### వరాహావతారము

దక్షిణం చుబుకస్యాంతే సర్పశీర్షం విధాయచ
వైష్ణవస్థాన మాలంబ్య వరాహం దర్శయే ద్బుధః.

కుడిచేయి సర్పశీర్ష హస్తముపట్టి గడ్డముక్రిందనుంచి వైష్ణవ స్థానమున నిలచిన వరాహావతార మగును.

### నృసింహావతారము

ఏకపాదస్థితో వర్ధమాన మగ్రే విధాయచ
పునః రేచిత మాధాయ నృసింహం సంప్రదర్శయేత్.

ఎడమకాలిమీద నిలిచి కుడి కాలు పురోభాగమునకు మడిచి ఎడమ మోకాలియందుంచి వర్ధమాన హస్తములను ముందుభాగమునకు పట్టి వ్రేళ్లు కంపింపజేసిన నృసింహావతార మగును.

వా మ నా వ తా ర ము

వామం కమండులుధర మరాళం హృదయే పరం
విధాయ వైష్ణవస్థానే స్థితో వామన మీాక్షయేత్.

ఎడమచేయి కమండులు ధరించినట్లుగా పద్మకోశ హస్తమును బోర్లవైచి కుడిచేయి హృదయమందు అరాళహస్తముగాపట్టి వైష్ణవ స్థానకమందు నిలిచిన వామనావతార మగును.

ప ర శు రా మా వ తా ర ము

సమస్థానస్థిత స్స్కంధే పతాకౌ సమసంగతౌ
వామే చోర్ధ్వముఖౌ కృత్వా జామదగ్నిం ప్రదర్శయేత్.

సమస్థానమున నిలిచి ఎడమభుజమున పతాకహస్తములు ఊర్ధ్వ ముఖముగా కలిపిపట్టిన పరశురామావతార మగును.

రా మా వ తా ర ము

స్థిత్వా ఽఽలీఢస్థానే సవ్యం శిఖరం ప్రసార్య తత్
పార్శ్వే ఽంససమీాపే ఖటకాముఖో ఽపరే విధీయతే.
సవ్యంచ శిఖరం కృత్వా దక్షిణం ఖటకాముఖం
వైష్ణవస్థాన మాసీనం రామచంద్రం ప్రదర్శయేత్.

ఆలీఢస్థానమందు నిలిచి ఎడమచేయిసాచి శిఖరహస్తముపట్టి, కుడిచేయి కుడిభుజమునకు ప్రక్కగా చెవిసమీాపమున ఖటకాముఖ హస్తము పట్టినను, ఎడమభుజముదగ్గర ఎడమచేయి శిఖరహస్తమును, కుడిభుజముదగ్గర కుడిచేయి ఖటకాముఖమునుపట్టి వైష్ణవసానమున నిలిచినను రామావతారమగును. [పా ఠా ం త ర ము]

సవ్యం పతాకహస్తంచ నిధాయోర్ధ్వతలం హృది
సందంశ మపరం నాసికాగ్రే దృష్టిం నివేశ్యచ
విలాస స్థాన మాసీనం రామచంద్రం నిదర్శయేత్.

కుడిచేయి పతాకహస్తమును ఎడమచేయి సందంశహస్తమును హృదయమువద్ద ఊర్ధ్వముఖముగాపట్టి నాసికాగ్రమున దృష్టిని నిల్పి విలాసముగా కూర్చున్న యెడల రామావతారమగును. [ఇది ప్రచారము నందున్నట్లు కనుపించుటలేదు.]

బలరామావతారము

హస్తౌతు ముష్టిశిఖరౌ సీరాకర్షణ లీలయా
ఆలీఢే సంస్థితః కృత్వా బలరామం ప్రదర్శయేత్.

విలాసముగా నాగలి పట్టుకున్నట్లు ఒకటి ముష్టిహస్తము మరి యొకటి శిఖరముపట్టి ఆలీఢమందు నిలిచిన బలరామావతారమగును.

బుద్ధావతారము

సమస్థానస్థితో డోలాహస్తౌ వుభయపార్శ్వయోః
సంచాలయన్ బుద్ధరూపం భరతజ్ఞః ప్రదర్శయేత్.

సమస్థానమున నిలిచి డోలాహస్తములు రెండుప్రక్కలకు ఊపుచు పట్టిన బుద్ధావతారమగును.

కల్క్యావతారము

పతాకం దక్షిణ స్కంధే కృత్వా ముష్టిం తథాపరే
ఏకపాదస్థితః కల్కిం భరతజ్ఞః ప్రదర్శయేత్.

ఎడమ భుజముమీద పతాకహస్తమును, కుడిభుజముమీద ముష్టిహస్తమునుపట్టి ఒంటికాలుమీద నిలిచిన కల్క్యవతార మగును.

బ్రహ్మ

నిగమాభ్యాసకరేణ బ్రహ్మస్థానే స్థితో విరించి స్స్యాత్.

కుడిచేయి హంసాస్యము, ఎడమచేయి చతురముపట్టి బ్రహ్మ స్థానమున నిలచిన బ్రహ్మయగును.

వేణుగోపాలుడు

త్రిభంగస్థాన మాలంబ్య సందంశౌ ముఖసన్నిధౌ
నిధాయ చాలయన్ వేణుగోపాలం దర్శయే ద్బుధః.

త్రిభంగస్థానమున నిలచి సందంశహస్తములు ముఖమునకు దగ్గరగా కొంచెము ప్రక్కకుపట్టిన వేణుగోపాలు డగును.

పద్మనాభుడు

నాభే రూర్ధ్వం పద్మకోశం దక్షిణం వినిధాయచ
సందర్శయే త్పద్మనాభం సర్వాభినయ కోవిదః.

కుడిచేయి నాభిదేశమునకు కొంచెము పైగా పద్మకోశ హస్తము పట్టి ఎడమచేయి అర్ధచంద్రముగా నడుమునందుంచి వైష్ణవ స్థానమున నిలచి పద్మనాభస్వామిని అభినయించవలయును.

విష్ణునానారూపములు

సమస్థానస్థితో హస్తౌ విధాయ వరదాభయౌ
నానావిధాని రూపాణి దర్శయేత్కమలేశితుః.

సమస్థానమున నిలిచి వరదాభయహస్తములు పట్టిన విష్ణుమూర్తి యొక్క నానారూపములయందు వినియోగించును.

శివుడు

శైవస్థానస్థిత శ్శూల ముద్రాంకిత కరోఽపరం
మృగశీర్షకరం కృత్వా గౌరీశం దర్శయేద్బుధః.

శైవస్థానమున నిలిచి కుడిచేయి త్రిశూలహస్తమును, ఎడమచేయి మృగశీర్ష హస్తమును పట్టిన గౌరీపతియగు ఈశ్వరుడగును.

అర్ధనారీశ్వరుడు

కృత్వా సవ్యం పద్మకోశం తామ్రచూడం తతోఽపరం
శైవస్థానే స్థిత స్త్వర్ధనారీశం దర్శయేద్బుధః.

కుడిచేయి పద్మకోశము, ఎడమచేయి తామ్రచూడము పట్టి శైవస్థానమున నిలిచిన అర్ధనారీశ్వరుడగును.

సద్యోజాతముఖము

తస్మిన్ స్థానే స్థితః కర్ణే నిధాయ ఖటకాముఖం
సద్యోజాతముఖం రుద్రం దర్శయే న్నాట్యకోవిదః.

శైవస్థానమందుండి ఎడమ చెవిదగ్గర ఖటకాముఖము పట్టి (కుడిచేయి త్రిశూలముపట్టిన) సద్యోజాతముఖుడగు ఈశ్వరుడగును.

వామదేవముఖము

అధోక్సృష్టి రుదోదేశే నిధాయ శిఖరంకరం
ఆకాశచరణం గచ్ఛన్ వామదేవం ప్రదర్శయేత్.

అధోముఖ దృష్టికలిగి హృదయస్థానమున శిఖరహస్తమునుపట్టి ఆకాశ చారీగమనమును చూపిన వామదేవముఖుడగు శివుడగును.

అ ఘో ర ము ఖ ము

ఆలీఢః కర్తరీం ఫాలే కృత్వాఽఘోరముఖో భవేత్.

కర్తరీముఖహస్తమును ఫాలభాగమునఉంచి ఆలీఢస్థానకమున నిలిచిన అఘోరముఖ శివుడగును.

త త్పు రు ష ము ఖ ము

శైవస్థః కర్తరీ వక్త్రే శిరోఽధశ్చాలయ న్కరౌ
దర్శయే ద్భరతాభిజ్ఞ శ్శివం తత్పురుషాకృతిమ్.

శైవస్థానమున నిలిచి కర్తరీముఖ హస్తము ముఖముదగ్గర పట్టి శిరమువంచి చలింపజేసిన తత్పురుషముఖ శివుడగును.

ఈ శా న ము ఖ ము

కృత్వైకం మృగశీర్షాఖ్యం అర్ధచంద్రం తతోఽపరం
శైవస్థో దర్శయే త్ప్రాజ్ఞ ఈశానముఖ మీశ్వరమ్.

ఒక చేయి అర్ధచంద్రము, మరియొకచేయి మృగశిరముపట్టి శైవస్థానకమున నిలిచిన ఈశానముఖ శివుడగును.

స ర స్వ తీ

అశ్వక్రాంతస్థానే స్థిత్వా ఖటకాముఖ మపసవ్యకరం
సవ్యం ముష్టిం కృత్వా సరస్వతీం దర్శయే దభినయజ్ఞః
దక్షిణం చతురం తిర్య క్ప్రసార్యాగ్రేఽపరం కరం
ఖటకావదనం వాణీం దర్శయే దాయతే స్థితే.

ఎడమచేయి ఖటకాముఖము, కుడిచేయి ముష్టిహస్తముపట్టి అశ్వక్రాంతస్థానకమున నిలిచినను, ఆయతస్థానకమున నిలిచి కుడిచేయి అడ్డముగా ముందుభాగమునకు సాచి, చతురహస్తముగాను, ఎడమ చేయి ఖటకాముఖముగాను పట్టిన సరస్వతీదేవి యగును.

ల క్ష్మీ దే వి

ఖటకావదనం వామం సవ్యపార్శ్వే నిధాయచ
విలాసస్థాన మాశ్రిత్య దర్శయే త్కమలాలయామ్.

ఎడమచేయి ఖటకాముఖముపట్టి కుడిపార్శ్వమునందుంచి విలాసస్థానమున నిలిచిన లక్ష్మీదేవియగును.

పార్వతీదేవి

వామాంసే వామఖటకాం పతాక మపరంకరమ్
అధఃకృత్వా చలత్పాదః పార్వతీం దర్శయే ద్బుధః
వామపార్శ్వే వామముష్టిం దక్షిణే ఖటకాముఖమ్
కర్ణాంతికే విధాయాంబాం చలత్పాదః ప్రదర్శయేత్.

ఎడమచేయి ఎడమభుజముదగ్గర ఖటకాముఖముగాను, కుడిచేయి అధోముఖముగా పతాకహస్తముగాను పట్టి కుడికాలు చలింపజేయుచు నిలచినను, ఎడమపార్శ్వమున ఎడమచేయి ముష్టిహస్తమును, కుడిచేయి కుడిచెవికి దగ్గరగా ఖటకాముఖమును పట్టి కుడికాలు చలింపజేసినను పార్వతీదేవియగును.

ఊర్వశీ

వామాంసే వామఖటకాం త్రిపతాకం చ మూర్ధని
విధాయాపాంగవిక్షేపై రూర్వశీం దర్శయే ద్బుధః.

ఎడమభుజమున ఎడమచేయి ఖటకాముఖమును, కుడిచేయి శిరమున త్రిపతాకగాను పట్టి క్రీగంటి చూపులు చూచుచు నిలిచిన ఊర్వశియగును.

భూదేవి

వామేన ఖటకాస్యేన పతాకేనేతరేణచ
అధోముఖేన వసుధాం దర్శయే న్నాట్యకోవిదః.

ఎడమచేయి ఖటకాముఖము, కుడిచేయి పతాకముపట్టి అధోముఖముగా మండలాకారము వచ్చునట్లు పట్టిన భూమియగును.

మన్మథుడు

విధాయ శిఖరం సవ్యం దక్షిణం ఖటకాముఖమ్
ధనుస్సంధాన నిరతః పంచబాణం ప్రదర్శయేత్
హంసాస్యం దక్షిణం శ్రోత్రే త్రిపతాకం పరంకరమ్

గండే పునశ్చ సందంశం హృదికృత్వాపి దర్శయేత్
సూచీముఖం దక్షిణంవా వామంచ ముకుళం స్మరే.

ఎడమచేయి శిఖరహస్తమును, కుడిచేయి ఖటకాముఖహస్తము ధనుస్సును సంధించినట్లు పట్టినను, కుడి చెవి దగ్గర హంసాస్యము, ఎడమచెక్కిలిదగ్గర త్రిపతాకమునుపట్టి మరల ఆ త్రిపతాకమును హృదయమందు సందంశహస్తముగా మార్చి పట్టినను, కుడి ఎడమ చేతులలో ఒకటి సూచీముఖము, మరియొకటి ముకుళము అంగ పర్యాయముగా పట్టినను మన్మథుడగును. (అత్ర మూలే వాశబ్దః ప్రకా రాంతరబోధకః అంగపర్యాయ ఇత్యర్థః)

మేఘము

అభయం దక్షిణం వామం పతాకం విరళాంగుళిం
విధాయాధోముఖం ప్రాజ్ఞః దర్శయేత వలాహకమ్.

కుడిచేయి అభయహస్తము, ఎడమచేయి వ్రేళ్లు విడివిడిగానుండు నట్లు పతాకహస్తమును అధోముఖముగాపట్టిన మేఘమగును.

వినాయకుడు

వామం కరికర ముదరే ఖటకాముఖ మపరం చలయిత్వాంసే
సందర్శయే ద్గణేశం సకలసురారాధితం విబుధః.

ఎడమచేయి ఉదరమునందు కరిహస్తముగాను, కుడిచేయి ఖట కాముఖము చలింపజేయుచు భుజమునందును పట్టిన వినాయకుడగును.

కుమారస్వామి

శ్రోత్రదేశే పురస్తాచ్చ త్రివారం కర్తరీముఖౌ
కృత్వా ఽభినయసారజ్ఞః సేనాన్యం సంప్రదర్శయేత్
వైశాఖే దక్షిణం తిర్యగ్విధాయ ఖటకాముఖమ్
తథా ఽభినయసారజ్ఞ ష్షణ్ముఖం సంప్రదర్శయేత్.

కర్తరీముఖ హస్తములు మూడుమార్లు చెవిదగ్గరను, ముఖము నకు ఎదురుగాను పట్టినను, లేక వైశాఖస్థానమందు నిలిచి కుడిచేయి అడ్డముగాత్రిప్పి ఖటకాముఖ హస్తముపట్టినను కుమారస్వామియగును.

సుగ్రీవుడు – ఆంజనేయుడు

కుంచితైకాంఘ్రి రాసీనో విధాయ ముకుళౌ కరౌ
సుగ్రీవం హనుమంతంచ దర్శయే న్నాట్యకోవిదః.

ఒకకాలు మడిచికూర్చుండి ముకుళహస్తములనుపట్టిన సుగ్రీవ – ఆంజనేయు లగుదురు.

అష్టదిక్పాలురు – ఇంద్రుడు

వామోఽరాళః ఫాలే త్రిపతాకో దక్షిణో భవే దింద్రే

ఎడమచేయి అరాళహస్తముగాను, కుడిచేయి త్రిపతాక హస్తముగాను ఫాలభాగమందుపట్టిన ఇంద్రుడగును.

అగ్ని

హృది కర్తరీతు తిర్యక్త్రిపతాకో భవతి సవ్యోఽగ్నౌ

హృదయమునందు ఎడమచేయి అడ్డముగాత్రిప్పి కర్తరీముఖము. కుడిచేయి త్రిపతాకము పట్టిన అగ్నియగును.

యముడు

వామం సూచీముఖం స్కంధే దక్షిణం చాలపల్లవమ్
కృత్వా సమస్థితః క్రూరదృష్టిః సందర్శయే ద్యమమ్

ఎడమచేయి ఎడమభుజమునందు సూచీముఖముగాను, కుడిచేయి వక్షమున అలపల్లవముగాను పట్టిన యముడగును.

నైరృతి

అంసేఽర్ధచంద్రం వామంచ సమస్థో దక్షిణం కరమ్
విధాయోర్ధ్వం పతాకంచ నిరృతిం దర్శయే ద్బుధః

ఎడమచేయి ఎడమభుజమందు అర్ధచంద్రము, కుడిచేయి ఊర్ధ్వ ముఖముగా పతాకము పట్టి సమస్థానమందు నిలిచిన నైరృతియగును.

వరుణుడు

అధోముఖం చలం సవ్యం పతాకం దక్షిణం కరమ్
అరాళం అభయం కృత్వా దర్శయేత ప్రచేతసమ్.

ఎడమచేయి అధోముఖముగా పతాకము, కుడిచేయి అరాళము పట్టి మరల అభయహస్తమువలె మార్చి పట్టిన వరుణుడగును.

వా యు వు

సమస్థో వామ మభయం పతాకం దక్షిణం కరమ్
ఊర్ధ్వం కృత్వా చాలయన్ సమీరం దర్శయే ద్బుధః

సమస్థానమున నిలిచి ఎడమచేయి అధోముఖముగాను, కుడి చేయి ఊర్ధ్వముఖముగాను చలింపజేయుచుండిన వాయువగును.

కు బే రు డు

వామే పద్మకోశంచ గదాహస్తంచ దక్షిణే
సమస్థానక మాదాయ కుబేరం సంప్రదర్శయేత్
వామం పద్మం దక్షిణేతు గదాఽఽయక పతేః కరః.

ఎడమచేయి పద్మకోశము కుడిచేయి గదాహస్తము (శిఖరము) పట్టి సమస్థానమున నిలిచిన కుబేరుడగును.

ఈ శా ను డు

దక్షిణం త్రిపతాకంచ వామం ముష్టిం విధాయచ
శైవస్థానస్థితః ప్రాజ్ఞో దర్శయే త్పార్వతీపతిమ్.

కుడిచేయి త్రిపతాకము, ఎడమచేయి ముష్టిహస్తముపట్టి శైవ స్థానమున నిలిచిన ఈశానదిక్పతియగు శివుడగును.

న వ గ్ర హ ము లు – బా ల సూ ర్యు డు

ఖటకావదనం కృత్వా పార్శ్వయో స్సమసంస్థితః
ప్రసన్నదృ గ్బాలభానుం భరతజ్ఞః ప్రదర్శయేత్.

సమస్థానముననిలిచి పార్శ్వ భాగములయందు ఖటకాముఖ హస్తములుపట్టి ప్రసన్న దృష్టితోచూచిన బాలసూర్యుడగును.

మ ధ్యా హ్న సూ ర్యు డు

దక్షిణం భ్రామయన్ సూచీం పురః ఫాలే నివేశ్యచ
క్రూరదృష్టి స్సమస్థాన స్థితో మధ్యందినాఽరుణమ్.

కుడిచేయి సూచీముఖహస్తము చక్రమువలె ముందు భాగమున చలింపజేయుచు ఫాలభాగమందుంచి క్రూరదృష్టితో సమస్థానమున నిలిచిన మధ్యాహ్నసూర్యుడగును.

సా యం సూ ర్యు డు

సమస్థో దర్శయే త్ప్రాజ్ఞః సాయంసమయ భాస్కరమ్.

ప్రసన్నదృష్టిగలిగి సమస్థానమున నిలిచి సూచీముఖహస్తములను ఫాలమునుండి అధోముఖముగా హృదయముదగ్గరకు కొనివచ్చిన సాయం సూర్యుడగును.

బా ల చ ం ద్రు డు

త్రిపతాకం కర్తరీంవా ప్రసార్యోర్ధ్వం సమస్థితః
దక్షిణం త్రిపతాకంచ కృత్వా బాలేందు మీక్షయేత్.

సమస్థానముననిలిచి ఎడమ చేయి త్రిపతాకముగాని, కర్తరీ ముఖముగాని ఊర్ధ్వముఖముగాపట్టి కుడి చేయి త్రిపతాకముపట్టిన బాలచంద్రుడగును.

పూ ర్ణ చ ం ద్రు డు

పూర్వవ త్సవ్య మపరమూర్ధ్వం సూచీముఖం కరమ్
భ్రామయ న్నూర్ధ్వదృక్పూర్ణచంద్రం ప్రాజ్ఞః ప్రదర్శయేత్.

బాలచంద్రుని యందువలె సమస్థానముననిలిచి ఎడమచేయి త్రిపతాకము లేక కర్తరీముఖము ఊర్ధ్వముఖముగాపట్టి మరల కుడిచేయి సూచీముఖముగామార్చి చలింపజేయుచు ఊర్ధ్వదృష్టి కలిగియుండిన పూర్ణచంద్రుడగును.

అ ం గా ర కు డు

నిధాయ పార్శ్వయో స్సూచీముఖం సందంశ ముగ్రదృక్
సమస్థానం సమాశ్రిత్య దర్శయే ద్భూమి నందనమ్.

సమస్థానమున ఉగ్రదృష్టితో నిలిచి ఉభయపార్శ్వములయందు ఒకచేయి సూచీముఖము మ రి యొ క చే యి సందంశము పట్టిన అంగారకుడగును.

బు ధు డు

వామాంసే ముకుళం వామం సందశం దక్షిణే భుజే
సౌమ్యదృష్టి స్సమస్థాన స్థితః సౌమ్యం ప్రదర్శయేత్.

ఎడమభుజమందు ఎడమచేయి ముకుళహస్తమును, కుడిభుజమందు కుడిచేయి సందంశహస్తముపట్టి సౌమ్యదృష్టితో సమస్థానమందుండిన బుధుడగును.

బృహస్పతి

మృగశీర్షం నాసికాగ్రే పతాకం వామమంసకే
కృత్వోర్ధ్వదృగ్గురుం ధీమాన్ దర్శయేచ్చాలయన్శిరః.

కుడిచేయి నాసికాగ్రమున మృగశీర్షహస్తమును, ఎడమచేయి భుజమందు పతాకహస్తమునుపట్టి ఊర్ధ్వదృష్టితో శిరము చలింపజేసిన దేవగురువగు బృహస్పతియగును.

శుక్రుడు

సందంశం పార్శ్వయోః కృత్వా మూర్ధానం చాలయన్బుధః
నిమీల్య చైకం నయనం దైత్యాచార్యం ప్రదర్శయేత్.

ఉభయపార్శ్వములయందు సందంశహస్తములనుపట్టి శిరము చలింపజేయుచు ఒక కన్నుమూసిన రాక్షసగురువగు శుక్రుడగును.

శని

క్రూరదృష్టి ర్మందగామీ ధరాం పశ్యన్ సమస్థితః
శుకతుండం సవ్య మూరుప్రాంతే పశ్చాత్పునః పురః
ముష్టిం దక్షిణతాం తామ్రచూడం కుర్యాచ్ఛనైశ్చరే.

క్రూరదృష్టికలిగి మెల్లగా అడుగులువేయుచు భూమిని చూచుచు సమస్థానమున నిలిచి ఎడమతొడ ప్రాంతమున ఎడమచేయి శుకతుండమునుపట్టి, మరల వెనుకభాగమునను ముందుభాగమునను ముష్టిహస్తమునుపట్టి, కుడిచేత తామ్రచూడమును పట్టిన శనైశ్చరుడగును.

రాహువు

సర్పశీర్షంవామకరే సూచీస్యాద్దక్షిణే కరే
రాహుగ్రహ కరప్రోక్తో భరతాగమ వేదిభిః.

ఎడమచేయి సర్పశిరము, కుడిచేయి సూచీముఖము పట్టిన రాహుగ్రహమగును.

కేతువు

వామే కేతు సూచీస్యా ద్దక్షిణేఽర్ధపతాకః
కేతుగ్రహ కరప్రోక్తో భరతాగమ వేదిభిః.

ఎడమచేయి సూచీముఖము, కుడిచేయి అర్ధపతాకము పట్టిన కేతుగ్రహమగును.

పంచభూతములు

పతాక సూచీవదన మనయో ర్వ్యాతపంచకే.

కుడిచేయి సూచీముఖము, ఎడమచేయి పతాకహస్తముపట్టినను, లేక వామదక్షిణ హస్తములు మార్చి పట్టినను పంచభూతములగును.

సముద్రము

పతాకస్వస్తికం కుర్యా దథవా స్వస్తికం కరౌ
సకృత్వా బహువారంవా చాలయ న్మండలం తథా
ఊర్ధ్వం పున రధోదేశే సముద్రాభినయే బుధః

పతాక స్వస్తికము, లేక త్రిపతాక స్వస్తికము ఒకసారిగాని, అనేక పర్యాయములుగాని మండలముగాను, ఊర్ధముగాను అధో ముఖముగాను చలింపజేయుచు పట్టిన సముద్రాభినయమగును.

ఆకాశగంగ

దక్షిణేన పతాకేన చోర్ధ్వం సవ్యేన తాదృశా
ప్రదృశ్య తిర్యక్సంచాల్య దర్శయేత వియన్నదీమ్.

సముద్రమువలె కుడిచేయి పతాకహస్తము ఊర్ధ్వముఖముగాను ఎడమచేయి ఊర్ధ్వముఖ పతాకహస్తము అడ్డముగా సంచలింపజేసిన ఆకాశగంగ యగును.

గంగానది

వామంతు ఖటకాం కృత్వా పతాకం విరళాంగుళిః
ప్రసార్య పురతోగచ్ఛన్ దర్శయే జ్జహ్నునందినీమ్.

ఎడమచేయి ఖటకాముఖము, కుడిచేయి వ్రేళ్ళు ఎడఎడముగా పతాకము సాచిపట్టి ముందుభాగమునకు నడిచిన గంగానదియగును.

### గోదావరీనది

అధోముఖౌ సంచలితౌ పతాకౌ విరళాంగుళీ
కృత్వా సందర్శయే న్నాట్యజ్ఞో గోదావరీం నదీమ్.

చేతివ్రేళ్ళు ఎడఎడముగా రెండుచేతుల పతాకహస్తములు పట్టి అధోముఖముగా సంచలింపజేసిన గోదావరినది యగును.

### కావేరి - రేవా - నర్మదా నదులు

పతాకౌ తాదృశౌ కృత్వా రుజుయానేన సంచరన్
కావేరీం దర్శయే ద్రేవాం చక్రసంచారణ స్తథా.

గోదావరీ నదివలె హస్తములనుపట్టి రుజుగమనముతో నడచుచు కావేరీనదిని అభినయించవలెను. మరియు పూర్వమువలెనే పతాక హస్తములనుపట్టి చక్రసంచారణము చేయుచు వక్రముగా నడచిన నర్మదానది యగును. [తథా తేనప్రకారేణ పతాకహస్తౌ కృత్వా వక్రసంచరణస్సన్ కుటిలగమనస్సన్ రేవాం నర్మదాంచ దర్శయేత్]

### తుంగభద్రా నది

పతాకం దక్షిణం చాధోముఖం సంచాలయ న్కరం
మృగశీర్షే కరే వామే మధ్యమాం కించిదున్నతామ్
విధాయ భరితాభిజ్ఞః తుంగభద్రాం ప్రదర్శయేత్.

అధోముఖముగా చలింపజేయుచు కుడిచేయి పతాకహస్తము, ఎడమచేయి మధ్యయందు కొంచెముగావంచి మృగశీర్షహస్తము పట్టిన తుంగభద్రానది యగును.

ఇతి శ్రీ భరతసారే నాట్యాచార్య లంకా సూర్యనారాయణశాస్త్రి
విరచితే ఆంధ్రవ్యాఖ్యానే దేవతా హస్త ప్రకరణమ్



## మనుష్య హస్త ప్రకరణమ్

### వధువు - అరుంధతి - పతివ్రత

ఆనమ్య వదనం పాదాంగుష్ఠం పశ్య న్నురస్థలే
విధాయ సవ్య ఖటకాకరౌ కించి ద్వివృత్యచ
వధూ మరుంధతీంచైవ దర్శయేత పతివ్రతామ్.

ముఖము వంచి కాలిబొటనవ్రేలు చూచుచు ఉరస్థలమున ఎడమ పార్శ్వముగా ఖటకాముఖహస్తములు కొంచె మెడముగాపట్టిన పెండ్లి కూతురు - అరుంధతీదేవి - పతివ్రతల యభినయమగును.

### వివాహము

సవ్యం ముష్టికరం కృత్వా ప్రకోష్ఠ మితరేణతు
కరేణ తస్య సంగృహ్యా దర్శయేత్ పాణిపీడనమ్
అన్యోన్యాభిముఖౌ ముష్టి మేళయే త్సస్మితాననమ్.

ఎడమచేయి ముష్టిహస్తముపట్టి కుడిచేత ఎడమచేయి మణికట్టు పట్టుకొనినను, చిరునవ్వు నవ్వుచు పరస్పరాభిముఖ మగునట్లు రెండు చేతులు ముష్టిహస్తములు కలిపిపట్టినను వివాహాభినయమగును.

### వేశ్య

ఖటకావదనం వామం వక్షదేశే నిధాయచ
దక్షిణం పద్మకోశంచ పురశ్కృత్వా విలోకయన్
సలీలం సస్మితం చాథ బుధో వేశ్యాం ప్రదర్శయేత్.

వక్షఃస్థలమున ఎడమచేయి ఖటకాముఖము, ముందుభాగమున కుడిచేయి పద్మకోశముపట్టి, విలాసముగ చిరునవ్వుతో చూచిన యెడల వేశ్యాభినయ మగును.

### విధవ

పతాకం దక్షిణం వక్షో దేశేచ ఖటకాముఖమ్
వామం కృత్వా వామపార్శ్వే కించి దాకుంచ్య మస్తకమ్
ధరా మాలోకయ న్థీరో విధవాం సంప్రదర్శయేత్.

కుడిచేయి పతాకము వక్షమందుంచి ఎడమచేయి ఖటకాముఖము ఎడమవక్షమందుంచి ఎడమపార్శ్వమునకు కొంచెము తలవంచి భూమిని చూచుచు నిలిచి విధవను ప్రదర్శించవలెను.

మరుగుజ్జు

పర్యాయతో ముష్టిహస్తౌ చాలయ న్నగ్రతో ముహుః
కుబ్జం కుబ్జాం శీఘ్రగామీ దర్శయే న్నాట్యకోవిదః.

మాటిమాటికి ముందుభాగమునకు వరుసగా ముష్టిహస్తములు చలింపజేయుచు త్వరితముగా నడచిన మరుగుజ్జు స్త్రీ పురుషుల అభినయమగును.

పొట్టివాడు

నికుంచ్య పృష్ఠం గచ్ఛన్ సఖర్వం దర్శయే ద్బుధః.
వీపునువంచి నడుచుచు పొట్టివానిని ప్రదర్శించవలెను.

అత్త

సర్పశీర్షం వామకరం త్రిపతాకంతు దక్షిణం
అనయో స్సంవిధౌ కృత్వా శ్వశ్రూం సందర్శయే ద్బుధః.

ఎడమచేయి సర్పశీర్షము, కుడిచేయి త్రిపతాకముపట్టి ఈ రెండు హస్తములు కలిపిన అత్త అభినయమగును.

మామ

అగ్రే వక్షస్యంజలించ పతాకం దక్షిణం తతః
దక్షిణాంసే సన్నిధాప్య శ్వశురం దర్శయే ద్బుధః.

వక్షస్థలమునకు ముందుభాగమున అంజలిహస్తముపట్టి తరువాత కుడిచేయి పతాకముగాజేసి కుడిభుజమందుంచిమామనుప్రదర్శించవలెను.

తోడికోడలు

వామ మర్థపతాకంచ మృగశీర్షంచ యాతరి.

ఎడమచేయి అర్థపతాకము కుడిచేయి మృగశీర్షముపట్టి తోడికోడలను ప్రదర్శించవలెను.

ఆ డ బి డ్డ

స్తనమూర్ధ్నా హంసపక్షం యోజయేచ్చ ననందరి.

శిరమువంచి హంసపక్షహస్తముపట్టి ఆడబిడ్డను చూపవలెను.

మ గ డు

సందంశం ప్రథమం కంఠే కృత్వా దక్షిణపాణినా

మణిబంధం తతో వామం గృహీత్వా దర్శయేత్పతిమ్.

మొదట కంఠమందు సందంశహస్తముపట్టి తరువాత కుడిచేయి మణిబంధముపట్టి ఎడమచేయి పట్టుకొని మగనిని ప్రదర్శించవలెను.

స వ తి

కృత్వా సవ్యం సర్పశీర్షం దక్షిణం ఖటకాముఖం

విధాయ వక్షోనికటే సపత్నీం దర్శయేద్బుధః.

వక్షస్థలసమ్ముఖమందు ఎడమచేయి సర్పశిరము, కుడిచేయి ఖటకాముఖముపట్టి సవతిని ప్రదర్శించవలెను.

క న్య - (కూ తు రు)

సమస్థో సవ్యఖటకా మగ్రే కన్యాం ప్రదర్శయేత్.

సమస్థానమునను నిలిచి ముందునకు ఎడమచేయి ఖటకాముఖహస్తముపట్టి కన్యనభినయించవలెను.

దా సి

వామాంసే సర్పశీర్షంచ కృత్వా దాసీం ప్రదర్శయేత్

ఎడమభుజమున సర్పశిరహస్తముపట్టిన దాసి యగును.

త ల్లి

దక్షిణం సర్పశీర్షంతు కృత్వాంసే మాతరం బుధః

కుడిచేయి భుజమందు సర్పశీర్షహస్తము పట్టిన తల్లియగును.

తం డ్రి

పార్శ్వే సవ్య పతాకంచ కృత్వా సింహాముఖం పరమ్

ఊర్ధ్వం సంచలయ న్ప్రాజ్ఞో పితరం సంప్రదర్శయేత్

ఎడమచేయి పార్శ్వమునకు పతాకహస్తముపట్టి కుడిచేయి సింహాముఖహస్తము ఊర్ధ్వముగాచలింపజేసిన తండ్రియందు వినియోగించును.

తా త

లలాటేఽంజలి మాదాయ దక్షిణం శిఖరం తతః
కృత్వా భరతశాస్త్రజ్ఞః దర్శయేచ్ఛ పితామహమ్.

లలాటమున అంజలిహస్తము తర్వాత కుడిచేయి శిఖరహస్తము పట్టిన తాతయందు వినియోగించును.

నా య న మ్మ

ముకుళో వక్షసి మూర్ధ్ని ఫణిశీర్షం పితామహీం.

కుడిచేయి వక్షమందు ముకుళహస్తముపట్టి ఎడమచేయి సర్పశీర్షము శిరమునందుంచిన నాయనమ్మయందు వినియోగించును.

[నిరూపే దక్షిణే ముకుళ స్సద్యః సర్పశీర్ష ఇతి జ్ఞేయః]

మ ర ది - బా వ

వక్షసి శిఖరం పశ్చాత్పతాక మపరం భావుక దేవరయోః.

వక్షమునందు కుడిచేయి శిఖరముపట్టి తరువాత ఎడమచేయి పతాకముపట్టిన మరది (చెల్లెలి పెనిమిటి) బావ (మగని తమ్ముడు) వీరియందు వినియోగించును.

పి న తం డ్రి

సర్పశీర్షః కటౌ కృత్వా పితృవ్యం దర్శయే ద్బుధః
పితృవ్యాన్ దర్శయే త్పార్శ్వే దక్షిణే రచితాంజలిః.

నడుమునందు సర్పశీర్షహస్తము పట్టినను, కుడిపార్శ్వమున అంజలిహస్తము పట్టినను పినతండ్రియందు వినియోగమగును.

అ క్క

పతాకా చతురా స్స్యాతాం అగ్రజాయాం భుజాగ్రయోః.

భుజములయందు పతాకహస్తములనుపట్టి చతురహస్తములుగా మార్చిన (జ్యేష్ఠభగిని) అక్కయందు వినియోగించును.

చె ల్లె లు

కనిష్ఠభగినీం నాభౌ మృగశీర్షేణ దర్శయేత్.

నాభిస్థానమున మృగశీర్షహస్తముపట్టిన చెల్లెలు (కనిష్ఠభంగిని) యందు వినియోగించును.

మే న మా మ

మాతులం దర్శయే త్పార్శ్వే వామే కృత్వాంజలిం బుధః.

ఎడమపార్శ్వమున అంజలిహస్తము పట్టిన మేనమామయందు వినియోగించును.

స్నే హి తు డు

సవ్యం పతాకం నిక్షిప్య పతాకే దక్షిణే కరే
నాట్యజ్ఞో దక్షిణే పార్శ్వే సఖాయం సంప్రదర్శయేత్.

ఎడమభాగమున పతాకహస్తము ఉంచి కుడిచేయి పతాకము పట్టి కుడిపార్శ్వమున స్నేహితుని అభినయించవలయును.

అ వ య వ ము లు

పాదౌ ఫాలం పతాకేన గుల్ఫే మధ్యంచ ముష్టినా
బాహుమూలే నితంబేచ జానునీ చార్ధచంద్రతః
జంఘాం కుక్షిం కపోతేన కరిహస్తేన సక్థినీ
ఖటకాముఖతో యోనిం మేఢ్రంతు మృగశీర్షతః
నఖాలక శిరో గండ వృషణం త్రిపతాకతః
రదనా శ్శుకతుండేన సందంశేన గుదం తథా
సూచీముఖేన దృష్టిం భ్రూ నాభి నాసాఽధరం గుణం
బుద్ధించ కేశపాశంతు కర్తరీ స్వస్తికేనచ
మనోవికారం కర్తర్యా నలినీకోశతః కుచౌ
బాణేన నఖరా శ్చాలపల్లవేన కచం తథా
దోరంతరం స్వస్తికేన ముకుళై శ్చూచుకే నఖం
రోమరాజిః సర్పమూర్ధ్ని కర్ణౌచ వచనానిచ
హంసాస్యేన యథాయోగ్యం దర్శయే న్నాట్యకోవిదః.

పాదములు-నుదురు పతాకము చేతను, చీలమండలు-నడుము ముష్టిహస్తముచేతను, చంకలు-పిరుదులు-మోకాళ్ళు అర్థచంద్రము చేతను, పిక్క-పొట్ట కపోతహస్తముచేతను, తొడలు కరిహస్తము చేతను, యోని ఖటకాముఖముచేతను, శిశ్నము మృగశీర్షమువలనను, గోళ్లు - ముంగురులు - శిరము - చెక్కిళ్లు - వృషణములు త్రిపతాకము చేతను, దంతములు శుకతుండముచేతను, గుదము సందంశముచేతను, దృష్టి - కనుబొమలు - బొడ్డు - ముక్కు - క్రిందిపెదవి - గుణము - బుద్ధి సూచీముఖముచేతను, కేశపాశము (జడ) కర్తరీ స్వస్తికచేతను, మనో వికారము కర్తరీ ముఖముచేతను, స్తనములు నలినీపద్మకోశమువలనను, గోళ్లు బాణహస్తముచేతను, వెంట్రుకలు అలపల్లవముచేతను, హృద యము స్వస్తికముచేతను, చూచుకములు - (స్తనాగ్రములు) గోరు ముకుళముచేతను, నూగారు సర్పశిరముచేతను, చెవులు - మాటలు హంసాస్యముచేతను యథాయోగ్యముగా అభినయించవలయును.

ఇతి శ్రీ భరతసారే నాట్యాచార్య లంకా సూర్యనారాయణశాస్త్రి
విరచితే ఆంధ్రవ్యాఖ్యానే మనుష్య హస్త ప్రకరణమ్



# మృగహస్తప్రకరణమ్

## అష్టదిగ్గజములు

వామోరాళం వామకర్ణే కరిహస్తంచ దక్షిణే
కృత్వైకమంఘ్రీం సంకుంచ్య దర్శయే దష్టదిగ్గజాన్.

ఎడమచేయి ఎడమచెవియందు అరాళము, కుడిచేయి కరిహస్తముపట్టి ఒక కాలు కుంచించిపట్టిన అష్టదిగ్గజముల యందు వినియోగించును.

## నూతనగజము

దక్షిణం త్రిపతాకంచ శ్రోత్రదేశే ఉలపల్లవమ్
నికుంచ్య పాదం ప్రత్యగ్ర గృహీతం దర్శయే ద్గజమ్.

కుడిచేయి త్రిపతాకము సాచిపట్టి ఎడమచేయి చెవియందు అలపల్లవహస్తముపట్టి కాలు కుంచించి పట్టిన నూతనగజమునందు వినియోగించును.

## ఆడు ఏనుగు

కుంచితాంఘ్రిః కరికరం సవ్యం కృత్వా కరేణుకామ్.

ఒక కాలు కుంచించి ఎడమచేయి కరిహస్తముపట్టిన ఆడు ఏనుగు యందు వినియోగించును.

## పెద్దపులి

క్రూరదృష్టిః లతాహస్తం ప్రసార్య పురతో బుధః
ఆలీఢే కుంచితాంఘ్రిశ్చ శార్దూలం దర్శయే ద్బుధః.

క్రూరదృష్టితో లతాహస్తమును ముందునకు సాచిపట్టి ఆలీఢ స్థానమున కాలు కుంచించి నిలిచిన పెద్దపులియందు వినియోగించును.

తాదృశ శ్చోర్ణనాభౌవా కృత్వా వ్యాఘ్రం ప్రదర్శయేత్.

పూర్వమువలె క్రూరదృష్టి పరపుచు ఆలీఢస్థానముననిల్చి కాలు కుంచించి ఊర్ణనాభహస్తము ముందునకు సాచిపట్టిన పెద్దపులియందు వినియోగము చెల్లును.

కుటిల భ్రూయుగం కృత్వా చలితా వలపల్లవౌ
దర్శయే ద్వ్యాఘ్ర మాలీఢ ప్రత్యాలీఢ స్థితో బుధః.

కనుబొమ్మలు ముడిచి, అలపల్లవహస్తములు చెలింపజేయుచు ఆలీఢ-ప్రత్యాలీఢ స్థానముల నిలిచిన వ్యాఘ్రమందు వినియోగించును.

పురుషా మృగము

సమస్థోఽగ్రేఽంజలిం బద్ధ్వా మూర్ధ్ని పార్శ్వే విలోకయన్
పర్యాయేణ పురోదేశే పతాకౌ సంప్రసార్యచ
దర్శయేచ్చ పురోగచ్ఛన్ నాట్యజ్ఞైః పురుషామృగః.

సమస్థానముననిలిచి అగ్రభాగమునకు అంజలి హస్తముపట్టి, పైకి ప్రక్కలకు చూచుచు పురోభాగమునకు ఒకదాని తరువాత ఒకటి పతాకహస్తములుసాచి ముందునకు నడచిన పురుషామృగమునందు వినియోగించును.

కోతులు

కుక్కుటాసనమాసీనో ముకుళౌ వురసోంతికే
నిధాయ దర్శయే త్ప్రాజ్ఞః చలభ్రూః ప్లవగర్ష భాన్.

కుక్కుటాసనమందు కూర్చొని వక్షమునకు ముందుభాగమున ముకుళ హస్తములుపట్టి కనుబొమలు చలింపజేసిన కోతులయందు వినియోగించును.

పిశాచములు

వక్రచారీ క్రూరదృష్టిః కృత్వా ముష్టీ చలాచలౌ
దంతాన్ సంఘట్టయన్ ప్రాజ్ఞః శాకిన్యాదీన్ ప్రదర్శయేత్.

వంకరనడక, క్రూరదృష్టికలిగి అడ్డదిడ్డముగా చలింపజేయు ముష్టిహస్తములతో దంతఘట్టనముచేసిన శాకిని, ఢాకినీ మొదలగు పిశాచములయందు వినియోగించును.

ఇతి శ్రీ భరతసారే నాట్యాచార్య లంకా సూర్యనారాయణశాస్త్రి
విరచితే ఆంధ్రవ్యాఖ్యానే మృగహస్త ప్రకరణమ్



# సంకీర్ణ ప్రకరణమ్

## రత్నములు

లాంగూలతః పుష్యరాగం వజ్రం సింహముఖేనచ
అర్ధచంద్రే ణేందుకాంతం హంసాస్యేనచ మౌక్తికమ్
ఖటకాముఖతో నీలం చతురేణ హరిన్మణిమ్
సందంశత శ్శోణరత్నం విద్రుమం శిఖరేణచ
కరేణార్ధపతాకేన గోమేధికమణిం తథా
సూర్యకాంతమణిం చాలపల్లవేన కరేణచ
సింహాస్యేనతు వైడూర్యం ప్రదర్శయతు కోవిదః.

లాంగూలహస్తమువలన పుష్యరాగము, సింహ ముఖహస్తముచేత వజ్రము, అర్ధ చంద్రహస్తముచేత చంద్రకాంతమణి, హంసాస్యహస్తముచేత ముత్యము, ఖటకాముఖహస్తముచేత నీలము, చతురహస్తముచేత మరకతము, సందంశహస్తముచేత పద్మరాగము, శిఖరహస్తముచేత పగడము, అర్ధపతాకముచేత గోమేధికము, అల పల్లవ హస్తముచేత సూర్యకాంతమణి, సింహముఖహస్తముచేత వైడూర్యము అభినయించవలెను.

## లోహములు

వామంతు త్రిపతాకేన చతురేణతు కాంచనమ్
రౌప్యం పతాకేన కాంస్యం సింహాస్యేనతు ముష్టినా
లోహం సూచ్యాతు తాత్భేదం సీసం లాంగూలత స్తథా
పతాకార్ధేన తద్భేదం లోహాదిక ఫలం తథా
ఆరకూటం బుధః ఖండచతురేణ ప్రదర్శయేత్.

ధనము త్రిపతాకముచేతను, బంగారము చతురహస్తముచేతను, వెండి పతాకముచేతను, కంచు సింహముఖముచేతను, ఇనుము ముష్టిహస్తముచేతను, సత్తు - తగరము సూచీముఖముచేతను, సీసము లాంగూలముచేతను, లోహభేదములను - లోహముల ప్రయోజనములను అర్ధపతాకముచేతను, ఇత్తడి ఖండచతురహస్తముచేతను అభినయించ వలయును.

### శృంగారాదిరసములు

రేఖేందు పద్మకోశాభ్యాం శృంగారం త్రిపతాకతః
వీరం హంసాస్యతో హాస్యం ముకురేన కృపారసమ్
సందంశే నాద్భుతం చోర్ణనాభేనతు భయానకమ్
కర్తరీ త్రిపతాకాభ్యాం భీభత్సం రౌద్రనామకమ్
శుకతుండేన శాంతంతు హంసపక్షేన దర్శయేత్.

రేఖాచంద్ర – పద్మకోశములచేత శృంగారము, త్రిపతాకముచేత వీరము, హంసాస్యమువలన హాస్యము, ముకుళహస్తముచేత కరుణము, సందంశహస్తముచేత అద్భుతము, ఊర్ణనాభహస్తముచేత భయానకము, కర్తరీ – త్రిపతాకహస్తములచేత భీభత్సము, శుకతుండముచేత రౌద్రము, హంసపక్షముచేత శాంతరసము అభినయించవలయును.

### మేషాదిరాశులు

హంసాస్య శ్శిఖర శ్చార్ధపతాకః కర్కట స్తతః
సింహాస్యో మృగశీర్ష శ్చ ముష్టిశ్చ శుకతుండకః
అర్ధ చంద్రోఽపి పతాకస్వస్తికః కలశ స్తథా
మకరోపి క్రమేణ స్యు ర్మేషాదిషుచ రాశిషు.

హంసాస్యము, శిఖరము, అర్ధపతాకము, కర్కటకము, సింహముఖము, మృగశీర్షము, ముష్టి, శుకతుండము, అర్ధచంద్రము, పతాకస్వస్తికము, కలశము, మకరము ఈ హస్తములు వరుసగా మేషాది రాశులందు వినియోగించును.

### వారాదులు

అర్ధచంద్రశ్చ సోమాఖ్యే భానౌ స్యా దలపల్లవః
త్రిపతాకః కుజే సౌమ్యే సందంశ శ్శిఖరో గురౌ
పతాకాఖ్యకర శ్శుక్రో ముష్టిస్స్యా న్మందవాసరే
సూచీముఖేన ఘటికా ప్రహరో హంసవక్త్రతః
హంసాస్యేన నిమేషాశ్చ పతాకేన దినాదయః.

అలపద్మన హస్తముచే ఆదివారము, అర్థచంద్రముచే సోమ వారము, త్రిపతాకముచే మంగళవారము, సందంశముచే బుధవారము, శిఖరముచే గురువారము, పతాకముచే శుక్రవారము, ముష్టిహస్తముచే శనివారమును, సూచీముఖముచే గడియలు, హంసాస్యముచే జాములు–నిముసములు, పతాకముచే దినములు – పక్షములు – అయనములు – వత్సరములు అభినయించవలెను.

## స్వ ర ము లు

మయూర మృగశీర్షాభ్యాం షడ్జంచ ఋషభం తతః
గాంధార మధ్యమే సింహ హంస్యాభ్యాంచ పంచమమ్
శుకతుండక రేణార్ధ పతాకేనతు దైవతమ్
నిషాదం కరిహస్తేన సందంశేనచ దర్శయేత్.

మయూరహస్తముచేత షడ్జమును, మృగశీర్షముచేత ఋష భము, సింహాముఖముచే గాంధారము, హంసాస్యముచేత మధ్యమము, శుకతుండముచే పంచమము, అర్ధపతాకముచే దైవతము, కరిహస్త-సందంశములచేత నిషాదమును. అభినయించనలయును.

## సం ఖ్య లు

సూచీముఖస్యా దేకస్మిన్ గణనేఽథ ద్వయో ర్భవేత్
కర్త ర్యర్ధపతాకోవా తామ్రచూడో భవే త్త్రిషు
త్రిపతాకోథవా స్యాతాం లాంగూల శిఖరా వుభౌ
షట్సు బాణః స ప్తసు స్యా త్సందంశా ష్టసు దృశ్యతే
హంసాస్యో నవసు స్యాతాం పతాక ఖటకాముఖౌ
దశసు స్యా దర్ధచంద్ర స్సంఖ్యా మేవం నిరూపయేత్.

ఒకటియను సంఖ్యయందు సూచీముఖము, రెండను సంఖ్య యందు కర్తరీముఖార్ధపతాకములు, మూడను సంఖ్యయందు తామ్ర చూడము, నాలుగను సంఖ్యయందు త్రిపతాక – లాంగూలములు, ఐదను సంఖ్యయందు లాంగూల – శిఖరములు, ఆరను సంఖ్యయందు బాణహస్తము, ఏడను సంఖ్యయందు సందంశము, ఎనిమిదియను

సంఖ్యయందు హంసాస్యము, తొమ్మిదియను సంఖ్యయందు పతాక - ఖటకాముఖములు, పదియను సంఖ్యయందు అర్ధచంద్రహస్తములు వినియోగించును.

నక్షత్రాదులు

ఊర్ధ్వం భ్రాంతేన ఋక్షాణి లాంగూలేన విభావయేత్
పుంఖితేన పతాకేన తిథయ స్తద్వయేన తు
యోగాశ్చ మృగశీర్షేణ కరణాని యథాక్రమమ్
సూచీముఖేన గణయన్ దక్షిణేన విశారదః.

కుడిచేయి సూచీముఖహస్తముపట్టి ఒకటొకటి నిరూపించుచు, ఊర్ధ్వముగా త్రిప్పిన ఎడమచేయి లాంగూలహస్తముచేత నక్షత్రములను, పుంఖితపతాకముచేత తిథులను, పతాకద్వయముచేత యోగములను, మృగశీర్షముచేత కరణములను యథాక్రమముగాఅభినయించవలయును.

షడ్రసములు

ఉద్వేష్టితం యథా కుర్యా న్మధురే చాలపల్లవౌ
దక్షిణే సింహవక్త్రేచ తిక్తేంగుష్ఠం ప్రచాలయేత్
లాంగూల మూర్ధ్వం చలయ న్నామ్లం సందర్శయే ద్బుధః
పతాకే చతురే కుర్యా త్తువరే నాట్యకోవిదః
కటుస్స్యా త్ఖండచతురే లవణో ముకుళే భవేత్
ఉద్వేష్టితంచ చలిత మేవం రసనిరూపణమ్.

అలపల్లవహస్తములు ఉద్వేష్టితముచేసిన మధురరసము (తీపి,) కుడిచేయి సింహముఖముపట్టి బొటనవ్రేలు కదిలించిన తిక్తరసము (చేదు,) లాంగూలము ఊర్ధ్వముగాచలింపజేసిన ఆమ్లరసము (పులుపు,) పతాక లేక చతురహస్తముచేత తువరము (ఒగరు,) ఖండ చతుర హస్తముచే కటురసము (కారము,) ముకుళహస్తము ఉద్వేష్టితముగా చలింపజేసిన లవణరసము (ఉప్పు) యందు వినియోగించును.

ఇతి శ్రీభరతసారే నాట్యాచార్య లంకా సూర్యనారాయణశాస్త్రి
విరచితే ఆంధ్రవ్యాఖ్యానే సంకీర్ణ ప్రకరణమ్

# పాదభేదప్రకరణమ్

## పాదభేదములు

సమపాదం చాగ్రగం స్యా దర్ధితం భ్రమణం తథా
కుంచితం పార్ష్ణికంచైవ ఘట్టితం పార్శ్వగం తతః
ఉత్సేధం తాడితం చాథోద్ఘట్టితం సూచికం తతః
పదాన్యమూని కీర్త్యంతే తథాగ్రతలసంచరమ్.

సమము, అగ్రగము, అర్ధితము, భ్రమణము, కుంచితము, పార్ష్ణికము, ఘట్టితము, పార్శ్వగము, ఉత్సేధము తాడితము, ఉద్ఘట్టితము, సూచికము, అగ్రతలసంచరము అని పాదభేదములు పదమూడు విధములు.

## పాదలక్షణములు

### సమపాదము

పదద్వయం సమం ధాత్ర్యాం సంస్థితంచ సమం భవేత్.

రెండుపాదములు సమముగా భూమియందుంచిన సమమనుపాదమగును.

### అగ్రగము

చలితం చే దంగుళీభి రగ్రత స్స్యా త్తదగ్రగమ్.

ముందుభాగమునకు చలింపజేయబడిన వ్రేళ్లుగల పాదము అగ్రగమను పాదమగును.

### అర్ధితము

అర్ధితం పార్శ్వతశ్చైకం చరణం, చలితం యది.

ప్రక్కకు చలింపజేయబడిన ఒకపాదము అర్ధితమను పాదమగును.

## భ్రమణము

ఉన్నతాంగుళి నైకేన భ్రమణం తాడ్యతే యది.

కాలి బొటనవ్రేలుమీద గుండ్రముగా తిరిగి నేలను ఘట్టించిన భ్రమణమను పాదమగును.

## కుంచితము

ఉద్ధృత్య కుంచితం ధాత్ర్యా మంగుళీభిః స్థితం యది.

కాలుఎత్తి వంచిపట్టి భూమియందు వ్రేళ్లు మోపి నిలిచిన కుంచితమను పాదమగును.

## పార్ష్ణికము

పార్ష్ణికం స్యాత్పదైకేన తాడితం పార్ష్ణిపృష్ఠతః.

ఒకకాలుచేత భూమిని మడమయొక్క వెనుకభాగమువలన ఘట్టించిన పార్ష్ణికమను పాదమగును.

## ఘట్టితము

ఘట్టితం తాడ్యతే పార్శ్వ దక్షిణేన పదా యది.

కుడికాలుచేత పార్శ్వమందు భూమిని ఘట్టించిన ఘట్టితమను పాదమగును.

## పార్శ్వగము

బహుప్రకారైశ్చరణైః పార్శ్వస్థం యది పార్శ్వగమ్.

అనేక అడుగులు ఆడి ఒకప్రక్కకు ఉంచబడిన పాదము పార్శ్వగమను పాదమగును.

## ఉత్సేధము

ఉత్సేధం చాగ్ర మూలాభ్యాం తాడ్యతే ధరణీ యది.

పాదముయొక్క మడమచేతను, వ్రేళ్లచేతను భూమినికొట్టిన ఉత్సేధమను పాదమగును.

### తాడితము

పదద్వయే నైకదా చే త్తాడ్యతే తాడితం భవేత్.

రెండుపాదములచేత భూమిని కొట్టిన తాడితమను పాదమగును.

### ఉద్ఘట్టితము

ఉద్ఘట్టితం పార్ష్ణినా చే త్పదస్థేనచ తాడ్యతే.

కాలియొక్క మడమచేత, పాదముచేత భూమినికొట్టిన ఉద్ఘట్టితమను పాదమగును.

### సూచికము

స్థిత్వైకేన స్పృశే ద్ధాత్రీ మంగుష్ఠేనతు సూచికమ్.

ఒకకాలుమీాదనిలచి రెండవకాలి బొటనవ్రేలుతో భూమిని తాకిన సూచిక మను పాదమగును.

### అగ్రతలసంచరము

అంగుళీభి ర్యదిచరే త్స్యా దగ్రతల సంచరమ్.

కాలివ్రేళ్లచేత ముందునకు నడచిన అగ్రతల సంచరమను పాదమగును.

## స్థానకములు

గతాగతంచ వలితం వైశాఖం వైష్ణవం సమమ్
ఆలీఢంచ తథా ప్రత్యాలీఢం మండల మోదితే
అశ్వాక్రాంతం చాయతంచ స్థానా న్యేతాని నర్తనే.

గతాగతము, వలితము, వైశాఖము, వైష్ణవము, సమము, ఆలీఢము, ప్రత్యాలీఢము, మండలము, మోదితము, అశ్వాక్రాంతము, ఆయతము అని స్థానకములు పదకొండు విధములు.



గ తా గ త ము

చలన్నివ శనైః
పాదం-పురతః
కుంచితాంగుళిః
ఉద్ధృత్య స్థాప్యచ
స్వాంఘ్రిం-తథా
కుర్యా ద్గతాగతే.

పాదము మెల్లగా చలింప జేయుచు ముందునకు వ్రేళ్లువంచి పాదమెత్తుచు భూమిమీద నుంచుచు నుండిన గతాగతమను స్థానకమగును.



వ లి త ము

ఏకస్యాంగుష్ఠ మన్యస్య
కనిష్ఠానామికాంతరే
నిధాయ మందం
చలితం-వలితం
పరికీర్త్యతే.

ఒకకాలి బొటనవ్రేలు రెండవకాలి అనామిక, చిటికెనవ్రేళ్ల నడుమ నుంచి మెల్లగా చలింప జేసిన వలితమను స్థానకమగును.



### వైశాఖము

అరత్నివ్యవధానేన నిధాయ చరణే సమమ్ ఊరూచ కించి దాకుంచ్య-వైశాఖం దర్శయే ద్బుధః.

పాదములు మూరెడెడముగా నుంచి తొడలు కొంచెము కుంచించిన వైశాఖ స్థానకమగును.



### వైష్ణవము

సమ మేకం విధాయాంఘ్రి-మన్య శ్చేత్కుంచితో మనాక్ పురః ప్రసారిత స్తిర్య-క్పదం స్యా ద్వైష్ణవం తథా.

ఒక పాదము సమముగాఉంచి రెండవ పాదమును కొంచెము వంచి మొదటిపాదము మీదుగా ముందునకు సాచి ప్రక్కగా ఉంచిన వైష్ణవమను స్థానకము రాగలదు.



సమము

సమపాదే సమౌ
పాదౌ-తాలమా
త్రాంతరస్థితౌ
స్వభావ సౌష్ఠవోపేతౌ
బ్రహ్మాచాత్రాధి
దైవతమ్.

స్వభావ సిద్ధముగా రెండుపాదములు జాన డెడము ఉండునట్లు ఉంచిన బ్రహ్మాధి దేవతాత్వముతగల సమస్థానక మగును. (రెండుపాదములు దగ్గరగా నుండుటయే లోకసిద్ధముగా నున్నది)



ఆలీఢము

వామో యత్ర
నిషణ్ణోరు రంబరే
పూర్వమానతః
దక్షిణశ్చరణ
శ్చాగ్రే పఞ్చతాళం
ప్రసారితః
త్ర్యస్రో ద్వావపి
తద్విద్యా దాలీఢం
రుద్రదైవతమ్.

ఎడమకాలి తొడను వంచి ముందుభాగమున నుంచి, దక్షిణ పాదాగ్ర

మును ఏడుజానలు ముందుగా సాచి, రెండుకాళ్లు త్ర్యస్రాకార మొనర్చిన రుద్రదైవత్యమగు ఆలీఢ స్థానకమగును.

ప్ర త్యా లీ ఢ ము

ఆలీఢాంగ విపర్యాసా త్ప్రత్యాలీఢ ముదీరితమ్
రుద్రంచ దైవతం తత్ర భాషతే శంభువల్లభః.

ఆలీఢ స్థానకమందలి అంగ విన్యాసమును అంగ విపర్యాయ మొనర్చిన రుద్రదైవత్య ప్రత్యాలీఢ స్థానకమగును.

మ ం డ ల ము

పక్షస్థౌ చరణౌ త్ర్యస్రా వేకతాలాంతరం భువి
కటీ జానుసమా వ్యోమ్ని సార్ధతాలద్వయాంతరే
ఊరూ యత్ర నిషణ్ణౌచ తన్మండల ముదీరితమ్.



త్ర్యస్రములగు పాదములు ప్రక్కలకుఉంచి, జానెడెడముగ భూమి యందుకూర్చుండి నడుమునకు సమానముగా మోకాళ్లు వచ్చునట్లు చేసి, రెండుతొడలకు మధ్య రెండు జా న ల న్న ర ఎడమగునట్లు చేసిన మండలమను స్థానమగును.



### మోదితము

ఏకస్య మోఽంఘ్రి
రన్యశ్చ-కుంచితోఽర్ధ
తలాంగులిః
అగ్రే యదోర్ధ్వగా
హస్తౌ-ఖర్కటౌ
మోదితం భవేత్.

ఎడమపాదము సమముగా ఉంచి, కుడిపాదము ఎడమపాదమునకు ఆరువ్రేళ్లు ఎడముగునట్లు కుంచించి, ముందునకు ఊర్ధ్వముఖముగు ఖర్కట హస్తములు పట్టిన మోదిత స్థానకమగును.



### అశ్వక్రాంతము

సమస్యైకస్య
పాదస్య-పార్ష్ణిదేశే
గతోఽపరః
సూచీపాదః
స్వపార్శ్వే వా-సప్త
తాలాంతరే స్థితః
యత్రాశ్వారోహణా
రంభే-తదశ్వ
క్రాంతముచ్యతే.

ఒకపాదము సమముగ ఉంచి రెండవపాదము పార్శ్వమునకుగాని ముందునకుగాని సూచీపాదముగ ఏడుజానలు దూరముగ నుంచిన అశ్వక్రాంతమను స్థానకమువచ్చును.

ఆ య త ము

వామ స్తాలాంతర త్ర్యస్రో దక్షిణ శ్చరణ స్సమః
కటీ నితంబగో హస్తో దక్షిణోఽన్యో లతాకరః
యత్రాయతం తదాఖ్యాతం కమలా చాత్ర దేవతా.



ఎడమకాలు త్ర్యస్రముగా జానెడెడమున ఉంచి కుడికాలు సమచరణముగ జేసి ఎడమచేయి లతాహస్తము (అలపల్లవహస్తము-గాపట్టి కుడిచేయి నడుమున ఉంచిన ఆయతమను స్థానకమగును దీనికి లక్ష్మీదేవి అధిదేవత.

ఇతి శ్రీభరతసారే నాట్యాచార్య లంకా సూర్యనారాయణశాస్త్రి
విరచితే ఆంధ్రవ్యాఖ్యానే స్థానక ప్రకరణమ్
సంపూర్ణశ్చాఽయం
గ్రంథః